




రుచిగా
చల్లగా
తియ్యగా వుండే
పార్లే
ఎక్స్‌ట్రా-స్ట్రాంగ్
పెప్పరమింట్లు

9 పెప్పరమింట్లు ఉండే ప్యాకెట్
ఎంతో తక్కువ ధరకు లభిస్తాయి
మాధుర్యమైన ఆహ్లాదమునకు
ఆహ్లాదకరమైన మాధుర్యమునకు



PARLE
Peppermint

everest/981/PP tel

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటి, మరి ఎన్నో ఆకర్షణలు.




ఈ. వహార్పు
అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
వల్లనే కదా!

అజీర్ణం, వాయువు,
కలతనిద్ర, వాంతులు,
విరేచనాలవంటి బాధలు
వెంటనే తగ్గిపోతాయి.
ఆకలి, జీర్ణశక్తి
బాగా ఉంటాయి.,
పాపాయి ఆరోగ్యం
బాగుపడుతుంది.




అమృతాంజన్ లిమిటెడ్

FDS AG 1659 TEL

మీ అభిమాన తారాగణంతో అడుగడుగునా మీ హృదయాలను
ద్రవింపచేసే కథనంతో నవరసభరితంగా రూపొందిన
కరుణామయ గాథ!

సాగర్ ఫిలింస్ వారి

# భాగ్యవంతుడు

నిర్మాత:
Ch. సీతారామరాజు
దర్శకత్వం:
C. S. రావు, B.A.(Litt.)







ఆంధ్ర; సీడెడ్: విజయ కంబైన్సు
నైజాం: ఉషా ఫిలింసు

VIJAYA

# డబ్బు చెట్లమీద మొలిచి పెరగదు




డబ్బు సంపాదించడమునకు మీరు ఎంత కష్టపడ్డారో మీకు మాత్రమే తెలుస్తుంది. కనుక దానిని జాగ్రత్త పెట్టుకొని, దాని మీద డబ్బు సంపాదించాలి అనుకొంటారు. అలా చేయుటలో బ్యాంక్ ఆఫ్ బరోడా మీకు సహాయపడుతుంది.

సేవింగ్స్ అకౌంటు. దీనిని మీరు రు. 1/- అంత తక్కువ మొత్తముతో ప్రారంభించ వచ్చును; మీకు యిష్టము వచ్చినంత మొత్తమును డిపాజిట్ చేయవచ్చును. మీకు పూర్తి మొత్తము మీద వడ్డీ లభిస్తుంది. రు. 10,000/- వరకు ముందుగా నోటీసు అక్కర లేకుండానే ఎప్పుడైనా తీసుకోవచ్చును.

మైనర్స్ సేవింగ్స్ అకౌంటు. దీనిని 10 ఏళ్ల పైబడిన పిల్లలు వారంతట వారే ప్రారంభించి, నిర్వహించుకోవచ్చును. 10 నుండి 13 ఏళ్ల మధ్య వయస్సుగల పిల్లలు గరిష్ఠ పరిమాణము రు. 50,000/- వరకు డిపాజిట్ చేయవచ్చును. 14 ఏళ్లు, అంతకు మించిన వారు అయితే పరిమితి లేదు.

బ్యాంకు డిపాజిట్ల మీద వడ్డీ రు. 3000/- వరకు రాబడి పన్నులో మినహాయింపు కలదు మరియు రు. 1,50,000/- వరకు బ్యాంకు డిపాజిట్ల మీద ఆస్తి పన్నుకు మినహాయింపు ఉంది. బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఒక సేవింగ్స్ అకౌంటును ప్రారంభించండి—మీ డబ్బు పెరుగుటలో సహాయపడండి!

సిరిసంపదలకు అక్షయ పాత్ర




## బ్యాంక్ ఆఫ్ బరోడా

హెడ్ ఆఫీస్: మాండ్వి, బరోడా.
550 పైగా బ్రాంచీలతో భారతదేశములో దాదాపు ప్రతి స్టేటులోను సేవ చేస్తోంది.
ఇంకా: యు.కె., తూర్పు ఆఫ్రికా, మారిషస్, ఫిజీ ద్వీపములు మరియు గియానాలలో బ్రాంచీలు కలవు.

Shiipi-BOB 1A/71 tel

ఏమా వృద్ధి! ఏమా వింత!
టానిక్ వల్ల అంత గొప్ప వ్యత్యాసం కలుగగలదా?





ఎదిగే వయస్సే,
ఇన్క్రిమిన్ *
సేవించే వయస్సు

ఇన్క్రిమిన్* మీ బిడ్డకు ఎదిగేందుకు ఆకలిని కలిగిస్తుంది

పెద్ద పిల్లలకు ఐరన్‌తో కూడిన ఇన్క్రిమిన్
సిరప్-175 మి.లీ. మరియు 57 మి.లీ.

పసి బిడ్డలకు 10 మి.లీ. ఇన్క్రిమిన్ డ్రాప్స్














అన్ని మందుల షాపులలో లభించుచున్నది. ఇన్క్రిమిన్ తయారు చేయువారు లెడర్లీ—అంతర్జాతీయంగా నమ్మకమైన పేరు. లెడర్లీ డివిజన్, సయానమిడ్ ఇండియా లిమిటెడ్. 254 / డి 2. డా. ఆ. బిసెంట్ రోడ్. బొంబాయి 25.

* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ మార్కు

లింటాస్-INC. 15-500 TL

# ఇంకో ప్యారీ మిఠాయి తినాలని ఆశ!




పిల్లలు ప్యారీ మిఠాయిలు ఎప్పుడూ కావాలనే అంటూ వుంటారు. పిల్లలు అతివేగంగా కోల్పోయే శక్తిని ప్యారీ మిఠాయిలు. భర్తీ చేస్తాయి, ప్యారీ మిఠాయిలు తాజాయైనవి, పుష్టికరమైనవి, చప్పరించకుండా వుండలేనంత రుచికరమైనవి.

తయారుచేయువారు: ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS/6395


జెమినీ సమర్పించు

మధు మూవీస్

# కళ్యాణ మంటపం

(పూర్తి రంగుల చిత్రం)

దర్శక, నిర్మాత: వి. మధుసూదనరావు

సంగీతం: ఆదినారాయణరావు, చిత్రీకరణ: వెంకటరత్నం, మాటలు: శివరామ కృష్ణ

నవయుగ

# ఉల్లాసకరమైన తాజా రుచిని అనుభవించండి మీ దాహమును తీర్చుకోండి!






గోల్డ్ స్పాట్ యొక్క రుచి అపురూపమైనది. దీనిని త్రాగుట వలన ఎంత మజా వస్తుంది; దాని మధురమైన తాజా రుచిని ఆనందించండి. పర్వతములలోని సెల ఏరుల చల్లని నీటి తాజాదనము గల ఈ పానీయమును త్రాగి సాటిలేని ఆనందమును పొందండి.

**మజా మజాగా ఉండండి... గోల్డ్ స్పాట్ త్రాగండి!**



mcm/pb/39 tel



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["వైద్యపరీక్ష"]కు ఆధారం షేక్ నశీమా బాను పంపిన కథ. ఐంద్రజాలికుడు సర్కార్ కథలు అప్పుడప్పుడూ ప్రచురిస్తున్న సంగతి పాఠకులకు తెలిసినదే. ఈ నెల ప్రచురించిన "వ్యాపారి యుక్తి" లో చక్కని నీతి ఉన్నది. కాళీమాత భక్తుణ్ణని చెప్పుకుంటూ ఎంతగానో గర్వపడే దొంగలనాయకుడు అతి సామాన్యమైన ఇంద్రజాలాన్ని దైవశక్తి అని నమ్ముతాడు. మతమూఢత్వానికి ఇది మంచి ఉదాహరణ.

సంపుటి 49 అగస్టు '71 సంచిక 2

CHITRA



# అమరవాణి

శాస్త్రేషు నిష్ఠా, సహజశ్చ బోధః,
ప్రాగల్భ్య మభ్యస్తగుణా చ వాణీ,
కాలాను రోధః ప్రతిభానవత్వ,
మేతే గుణాః కామదుఘాః క్రియాసు—1

[శాస్త్రములందు నిష్ఠా, సహజజ్ఞానమూ, ధైర్యమూ, మాటలలో నేర్పరితనమూ, సమయానుకూలత్వమూ, ప్రతిభా—ఇవి కార్యదక్షుడికి కామధేనువు లాటి గుణాలు.]

త్రివిక్రమో భూదపి వామనో సౌ,
స సూకరశ్చేతి స వై నృసింహః;
నీచై రనీచై రతినీచనీచై,
సర్వై రుపాయైః ఫలమేవ సాధ్యం—2

[త్రివిక్రముడు కూడా వామనుడైనాడు, పంది అయాడు, నరసింహ మయాడు. నీచ మయేది, కాకపోయేది, నీచాతి నీచమయేది, ఏ విధంగానైనా కార్యం సాధించాలి.]

కోతి భారః సమర్థానాం? కిం దూరం వ్యవసాయినాం?
కో విదేశః సవిద్యానాం? కః పరః ప్రియవాదినాం?—3

[సమర్థుడికి అతి భారం ఏమున్నది? కార్యదక్షుడికి దూరం ఏమిటి? విద్య గల వాడికి విదేశ మేమిటి? మంచిగా మాట్లాడేవాడికి శత్రువు ఎవరు?]

కార్యసాధన



# పారని పథకం

ఒక గ్రామంలో లక్ష్మయ్యా, సీతయ్యా అని ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. తల్లి దండ్రులు పోయాక వాళ్ళు తమకు గల కొద్దిపాటి భూమిని సమంగా పంచుకుని వేరువేరు కాపరాలు పెట్టారు. కొంతకాలం పాటు ఇద్దరూ వ్యవసాయం చేశారు. సీతయ్యకు తన జీవితం సుఖంగానే తోచింది, కాని ఆశాపరుడైన లక్ష్మయ్యకు తృప్తి కలగలేదు. అందుచేత అతను తన పొలం అమ్మేసి, పొరుగూరు చేరి, అక్కడ దుకాణం పెట్టి, వ్యాపారం సాగించాడు.

లక్ష్మయ్య మొదట్లో న్యాయంగానే వ్యాపారం చేశాడు. అయితే, న్యాయమైన వ్యాపారంలో భారీగా లాభాలు రావని తెలిసి, అతను వ్యాపారంలో మోసాలు చేసి, త్వరలోనే చాలా ధనం పోగుచేశాడు.

ఇంతలో ఆ ప్రాంతాల బందిపోటు దొంగల బెడద జాస్తి అయింది. వాళ్ళు తాను ఉన్న గ్రామం మీదికి వస్తున్నారని తెలియగానే లక్ష్మయ్య తన వద్ద ఉన్న నగలూ, బంగారమూ, రొక్కమూ ఒక పెట్టెలో పెట్టుకుని, దొడ్డిదారిన తన తమ్ముడు ఉన్న గ్రామానికి బయలుదేరాడు.

లక్ష్మయ్య అక్కడికి చేరేసరికి దాదాపు అర్ధరాత్రి అయింది. ఆ సమయంలో తన తమ్ముడి ఇంటికి వెళ్ళటం కన్న, తన పెట్టెను ఎక్కడన్నా పొలంలో పాతిపెట్టటం మంచిదని అతనికి తోచింది. ఎందుకంటే, తన దగ్గిర అంత డబ్బున్నదని తెలిస్తే, తమ్ముడు సీతయ్య అసూయపడవచ్చు, లేదా డబ్బు సహాయం కోరవచ్చు. అదీ గాక, బందిపోటు దొంగలు సీతయ్య ఉంటున్న గ్రామానికే రావచ్చు. అన్ని విధాలా ఆలోచించిన లక్ష్మయ్య, తన పెట్టెను ఆదరాబాదరా ఒక పొలంలో పాతిపెట్టి, తన గ్రామానికి తిరిగి వెళ్ళాడు.

కె. ఉదయశంకర్

లక్ష్మయ్య తన ఇంటికి తిరిగి వచ్చేసరికి, బందిపోటుదొంగలు అతని దుకాణాన్ని కొల్లగొట్టి సరుకంతా పట్టుకుపోయారు. ఊళ్ళోవాళ్ళతో బాటు లక్ష్మయ్య కూడా, తన కున్నదంతా దొంగలు దోచుకున్నారని ఏడిచి, తాను తన తమ్ముడి ఊళ్ళో దాచిన నగలపెట్టె తెచ్చుకోవడానికి బయలు దేరాడు. కాని, అతను ఎంత వెదికినా ఆ నగలపెట్టె జాడ కనిపించలేదు. అర్ధరాత్రి వేళ తాను అడావిడిగా ఏ పొలంలో ఆ పెట్టె దాచాడో అతనికి సరిగా గుర్తు కూడా లేక పోయింది.

నగలపెట్టె కూడా పోయేసరికి లక్ష్మయ్య తన తమ్ముణ్ణి ఆశ్రయించవలసిన వాడైనాడు. అతను తమ్ముడి దగ్గిరికి వెళ్ళి, తా నుండే గ్రామంలో దొంగలు పడి, తన కున్నదంతా దోచుకుని, కట్టుబట్టలతో తనను మిగిల్చారని చెప్పుకున్నాడు. సీతయ్య తన అన్నను చూసి జాలిపడి, తన వద్దనే ఉండనిచ్చాడు.

లక్ష్మయ్య వచ్చిననాడే సీతయ్య ఇంట్లో విందు జరిగింది. అటు తరవాత కూడా సీతయ్య ఇల్లు నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉండటం గమనించి, ఉండబట్టలేక లక్ష్మయ్య తన తమ్ముణ్ణి, "నీ కింత డబ్బు ఎలా వచ్చిందిరా?" అని అడిగాడు.

"నా పొలంలో నగలపెట్టె దొరికింది," అంటూ సీతయ్య తన అన్నకు ఒక పెట్టె చూపించాడు. అది లక్ష్మయ్య పెట్టే. అందులో ఇంకా సగం నగలు ఉన్నాయి; అవి లక్ష్మయ్యవే. కాని, తన కున్నదంతా దొంగలు దోచుకున్నారని చెప్పిన లక్ష్మయ్య, ఆ పెట్టె తనదేనని ఇప్పుడు ఎలా అనగలడు? ధనలోభం కొద్దీ అంటున్నాడనీ, తన తమ్ముడికి దొంగతనం అంటగట్టుతున్నాడనీ ఆరోపించి, తనను ఊళ్ళోవాళ్ళు కాకులు పొడిచినట్టు పొడుస్తారు.

అందుచేత లక్ష్మయ్య ఆ పెట్టెను గురించి నోరెత్తక, తన తమ్ముడి దగ్గిర డబ్బు అప్పు తీసుకుని పొలం కొనుక్కుని, వ్యవసాయంలో ప్రవేశించి, తన రాబడిలో సగం తమ్ముడికి చెల్లువేస్తూ, తన స్వగ్రామంలోనే స్థిరపడిపోయాడు.






# వీరరాజకుమారుడు

ధవళపుర మహారాజు ఆకస్మికంగా చని పోయేసరికి మహారాజు తమ్ముడైన వీర సింహుడు రాజు అయాడు. అయితే, చని పోయిన మహారాజుకు సూర్యసింహు డనే పన్నెండేళ్ళ కుమారుడు ఉన్నాడు. ఆ సూర్యసింహుణ్ణి చంపించినట్టయితే తానే రాజుగా ఉండివచ్చు నన్న దుర్బుద్ధి వీరసింహుడికి కలిగింది.

ఈ సంగతి పసిగట్టి మంత్రి రాజకుమా రుడి ప్రాణాలు కాపాడటానికి పూనుకు న్నాడు. ఆయన రాజకుమారుణ్ణి రహస్యంగా తన వెంట తీసుకుని, రాజ్యసరిహద్దుల్లో వున్న కృష్ణగడానికి బయలుదేరాడు. ఆ దేశా నికి అతని పినతల్లే రాణి.

వారు అంజనపుర మనే గ్రామాన్ని చేరే సరికి సాయంకాల మయింది. ఆ గ్రామం లోని ధనికుడైన ఒక రైతు మంత్రికీ, రాజ కుమారుడికీ ఆతిథ్యం ఇచ్చాడు. రాజకుమా రుణ్ణి రైతుఇంట ప్రతి ఒక్కరూ వింతగా చూశారు. దానికి కారణ మేమిటో మంత్రికి మొదట అర్థం కాలేదు. రైతు కొడుకు మూ డు మూ ర్తు లా రాజకుమారుణ్ణి పోలి ఉంటాడు! ఆ కుర్రవాడి పేరు బలరాముడు.

బలరాముణ్ణి చూడగానే మంత్రి కూడా అమితంగా ఆశ్చర్యపడ్డాడు. ముఖంలోనూ, ఆకారంలోనూ, ఎత్తులోనూ, చివరకు నడ కలో సైతం రాజకుమారుడికీ, బలరాముడికీ ఎంతో పోలిక ఉన్నది. ఇద్దరూ కవలపిల్లల లాగున్నారు.

బలరాముణ్ణి తన వెంట ఉంచుకుంటే ఉపయోగం ఉండవచ్చు ననిపించి మంత్రి రైతుతో, "నీ కొడుకును రాజకుమారుడి చెలికాడుగా పంపినట్టయితే వాడికి ముందు ముందు ఎంతో మేలు కలగవచ్చు. నేను నీకు పుష్కలంగా ధనం కూడా ఇస్తాను," అన్నాడు.

సి. హేమలత




రైతు అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

మంత్రి రాజకుమారుడితో బాటు రైతు కుమారుణ్ణి కూడా వెంటబెట్టుకుని నాలుగు రోజులు ప్రయాణం చేసి, కృష్ణగడం చేరాడు. ఈ ప్రయాణంలో రాజకుమారుడికీ, రైతుకొడుకైన బలరాముడికీ గాఢమైన మైత్రి ఏర్పడింది.

కృష్ణగడం మహారాణి అతిధులకు చక్కని ఏర్పాట్లు చేసింది. వారు అక్కడ ఎంతకాలమైనా సుఖంగా గడపటానికి వీలు కలిగింది. రోజులు గడుస్తున్నకొద్దీ రాజకుమారుడికీ, రైతు కుమారుడికీ మధ్య మైత్రి కూడా అభివృద్ధి అయింది.

ఇలా కొంత కాలం గడిచాక వీరసింహుడికి రాజకుమారుడు కృష్ణగడంలో ఉన్న వార్త తెలిసి, అతను సైన్యంతో వచ్చి కృష్ణగడాన్ని ముట్టడించాడు.

తన మూలంగా తన పినతల్లికి ప్రమాదం రావటం ఎంతమాత్రమూ ఇష్టంలేక ధవళపుర మంత్రి తెల్లజెండా ఎత్తి వీరసింహుడితో సంధి చేసుకోవటానికి బయలు దేరాడు.

రాజకుమారుణ్ణి తన వశం చేసినట్టయితే వీరసింహుడు ముట్టడి ఎత్తి తిరిగి పోతానన్నాడు. మంత్రికి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. తాను రాజకుమారుణ్ణి కాపాడటానికి చేసిన ప్రయత్నమంతా వృధా అయిపోయింది.

అయితే రాజకుమారుణ్ణి కాపాడటానికి ఇంకా ఒక మార్గం మిగిలి ఉన్నది. అదేమిటంటే, రైతుకుమారుడైన బలరాముణ్ణి రాజకుమారుడని చెప్పి వీరసింహుడికి అప్పగించటం.

మంత్రి బలరాముణ్ణి ఏకాంతంగా పిలిచి, "నాయనా, రాజకుమారుణ్ణి తనకు వశపరచమని శత్రురాజు కోరుతున్నాడు. అతను రాజకుమారుడి ప్రాణం తీసే అవకాశం కూడా ఉన్నది. రాజకుమారుడివి నువేనని నిన్ను పంగలను. శత్రురాజు తెలుసుకోలేడు. కాని అలా చేస్తే నీ ప్రాణానికీ

ప్రమాదం కలగవచ్చు. ఏమి చెయ్యటానికీ నాకు పాలుపోకుండా ఉన్నది," అన్నాడు.

ఈ మాటలు వినగానే బలరాముడు, "బాబుగారూ, నా ప్రాణం పోయినందు వల్ల కలిగే నష్టం లేదు. కాని రాజకుమారుడు నాలుగు కాలాల పాటు బతికి ఉంటే రాజ్యం తిరిగి సంపాదించుకో గలుగుతాడు. రాజవంశం నిలుస్తుంది. శత్రురాజు దగ్గిరికి నన్ను పంపండి. ఈ సంగతి రాజకుమారుడికి మాత్రం తెలియనివ్వకండి. అతను నాపై గల ప్రేమకొద్దీ పని జరగకుండా అడ్డుపడవచ్చు," అన్నాడు.

మంత్రి ఈ మాటకు ఎంతో సంతోషించి, బలరాముడికి రాజలాంఛనాలన్నీ తగిలించి, భటుల వెంట, కృష్ణగడం కోట వెలపల సైన్యంతో విడిసి ఉన్న వీరసింహుడి డేరాకు పంపాడు.

బలరాముడు బయలుదేరిన కొద్దిసేపటికి రాజకుమారుడు అతని కోసం వెతకసాగాడు. అతన్ని భటులు కోట దాటించి తీసుకుపోయారని తెలిసింది. కోట బయట తన పినతండ్రి ముట్టడి వేసి ఉన్నాడనీ, అతను తన ప్రాణం తీయటానికి తహతహలాడుతున్నాడనీ, బలరాముణ్ణి చూసి ఎవరైనా తానే అని భ్రమపడవచ్చుననీ అతనికి తెలుసును. అతను ఒక భటుడి చేత ఉన్న కత్తి లాక్కుని అతి వేగంగా కోట బయటికి పరిగెత్తాడు.

బలరాముడు వీరసింహుడి గుడారం ప్రవేశించగానే వీరసింహుడి భటులు



అతన్ని రాజకుమారుడిగా గుర్తించి, "చినరాజుగారే!" అని ఆనందంతో కేకలు పెట్టారు. వీరసింహుడు వారిని బయటికి పంపేసి, బలరాముడితో, "ఇంత కాలానికి నాకు దొరికావు. నాకూ, సింహాసనానికీ మధ్య అడ్డంగా వున్న నిన్ను ఈ క్షణమే చంపేసి, నా దారి నిష్కంటకం చేసుకుంటాను," అంటూ కత్తి ఒకటి చేత పట్టుకున్నాడు.

బలరాముడు చలించలేదు. "నన్ను చంపి నువు బాగుపడవు. ఉన్న సింహాసనాన్ని కూడా పోగొట్టుకుంటావు," అన్నాడా కుర్రవాడు. వీరసింహుడు కత్తి దూసి బలరాముడి పైకి వచ్చాడు. బలరాముడు అతనికి అందకుండా పరిగెత్తసాగాడు.

ఇంతలో "ఆగు!" అని గుడారం ద్వారం వద్ద నిలబడి రాజకుమారుడు కేక పెట్టాడు. వీరసింహుడు అటు చూసి నిర్ఘాంతపోయాడు. ఇద్దరు రాజకుమారులు తన గుడారంలోకి ఎలా వచ్చారో అతనికి అర్థం కాలేదు. అమితమైన దిగ్భ్రమలో అతని చేతి కత్తి కిందికి జారిపోయింది. మరుక్షణం రాజకుమారుడు వీరసింహుడి మీదికి లంఘించి, ఒక్క దెబ్బతో అతని తల నరికేశాడు.

వీరసింహుడు చచ్చాడనగానే అతని వెంట వచ్చిన సైనికు లందరూ మూగారు. తమ కాబోయే రాజే వీరసింహుణ్ణి హత్య చేశాడనీ, వీరసింహుడు తమ రాజకుమారుణ్ణి హత్య చేయబోవటం చేత అలా జరిగిందనీ తెలియగానే సైనికులు ఎంతగానో సంతోషించారు.

తరవాత రాజకుమారుడు మంత్రితోనూ, బలరాముడితోనూ తన దేశానికి తిరిగి పోయాడు. వెంటనే రాజకుమారుడికి పట్టాభిషేకం జరిగింది. రాజప్రతినిధిగా మంత్రి కొంత కాలం రాజ్యం చేసి, రాజకుమారుడు యుక్తవయస్కుడు కాగానే రాజ్యభారం అతనికి అప్పగించాడు. బలరాముడు అనేక జాగీర్లకు అధిపతి అయి, రాజకుమారుడికి ముఖ్య అంతరంగికుడుగా ఉంటూ యావజ్జీవ స్నేహం చేశాడు.





## 11

[చెట్టుకు కాపలాకాస్తున్న యువకుడు, ఖడ్గ జీవదత్తులకు చెట్టుతొర్రలో నుంచి వున్న రహస్య మార్గం సంగతి చెప్పాడు. వాళ్ళు దాని వెంటపోయి ఒక మిట్టకోట ప్రాంతాన్ని చేరి, అక్కడ సింహం బారినుంచి ఒక స్త్రీని కాపాడారు. ఆమె భర్త అడవి నుంచి వేటాడిన జంతువులతో తిరిగి వచ్చి, వాళ్ళను తన భవనానికి తీసుకుపోయాడు. తరవాత—]

మహాకాయుడు, ఖడ్గ జీవదత్తులకు తన భవనంలోని ఒక పెద్ద గది చూపించి, "ఇదుగో, యిది మీ విడిది గది. వంటకవసరం అయిన సరంజామా అంతా లోపల వున్నది. కొద్ది సేపట్లో యీ వేటమాంసం మీకావలసినంత నా భార్య తెచ్చి యిస్తుంది," అని చెప్పి, జవాబు కోసం ఆగకుండా మెల్లెక్కి భవనం మీదికి వెళ్ళిపోయాడు.

ఖడ్గ జీవదత్తులు ఆ గదిలో ప్రవేశించి వంట ప్రయత్నాలు ప్రారంభించి, రాత్రి తొమ్మిది గంటలకల్లా తృప్తిగా భోజనాలు చేసి, నిద్రకు ఉపక్రమించారు. వాళ్ళకు ఒక రాత్రివేళ గది బయట అడుగుల చప్పుడు వినిపించింది. ఎవరై వుంటారా అని వాళ్ళు ఆలోచించేంతలో, "బావగారూ! ఆ పొగరుబోతు కుర్రవెధవలు యిక్కడికి వచ్చారా? వాళ్ళ శవాలెక్కడ? ఇంకా



వాళ్ళు ప్రాణాలతో వుంటే, యీ గండ్రగొడ్డలికి బలిపెడతాను!" అన్న మాటలు వినిపించినై.

ఆ గొంతు అడవిలో చెట్టుకు పహరా తిరిగే గండ్రగొడ్డలి యువకుడిది! ఖడ్గ జీవదత్తులు ఆ గొంతు పోల్చుకున్నారు. ఖడ్గవర్మ తన పక్కనే వున్న కత్తిని ఒరలో నుంచి బయిటికి లాగి ద్వారం దగ్గిరకు పోయి తలుపు తెరిచాడు.

భవనం మెట్ల దగ్గిరకు పోతున్న గండ్రగొడ్డలి యువకుడు తన వెనక వైపున కిర్రుమంటూ తలుపు తెరుచుకున్న శబ్దం వింటూనే గిరుక్కున వెనుదిరిగి చూశాడు. వెన్నెల వెలుగులో అతడికి ఖడ్గవర్మ కనిపించాడు; అతడి చేతిలోని కత్తి తళతళ మెరుస్తున్నది.

"అరెరె, ఎవడివి నువ్వు? .... వాడివా, వాడి భూతానివా? మిట్టకోటకు వచ్చి రాత్రి నిద్రచేసిన వాడెవడూ యింతవరకు లేడు!" అన్నాడు యువకుడు గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని.

"ఒరే, అర్భకుడా, అట్టే వాగక పోయి బుద్ధిగా పడుకుని నిద్రపో. మళ్ళీ నీ కేకల్తో నిద్రాభంగం కలిగించావో, నీ చర్మం ఒలిచేస్తాను," అన్నాడు ఖడ్గవర్మ కోపంగా ద్వారబంధం దాటి బయిటికివస్తూ.

యువకుడు కాస్త బెదిరి మరో రెండు మూడు మెట్లు గబగబా ఎక్కి, "చర్మం ఒలుస్తావా? నన్నేదో సింహమో, పులో అనుకుంటున్నావా? చూడు నిన్నిప్పుడే నా గండ్రగొడ్డలికి...."

యువకుడు మాట ముగించే లోపలే మెట్ల పై భాగం నుంచి మహాకాయుడు విసిరిన ఒక పెద్ద బొమిక వచ్చి అతడి వీపుకు ఠపీమంటూ తగిలింది. యువకుడు అదిరిపడి తలఎత్తి చూసేంతలో మహాకాయుడు పైన నిలబడి అతడి కేసి చూస్తూ, "ఎందుకు జంగుపిల్లిలా ఒకటే అరుపు ప్రారంభించావు? ఈ సమయంలో నేను భోజనం చేస్తుంటానని నీకు తెలియదా?" అన్నాడు కోపంగా.

యువకుడు ఒకటికి రెండుసార్లు తన బావ కేసీ, ఖడ్గవర్మ కేసీ తల తిప్పి చూసి, "చెట్టు దగ్గిర నా చేత తన్నులుతిని పారి పోయి వచ్చిన వాళ్ళను నువ్వింకా ఎందుకు బతికుండనిచ్చావు? ఆ రెండో వాడేడీ?" అన్నాడు.

ఖడ్గవర్మ కత్తి ఝళిపిస్తూ మెట్ల కేసి బయలుదేరాడు. యువకుడి మాటల తీరు అతడికి చాలా అమర్యాదకరంగా కనిపించింది. అతణ్ణీ, అడ్డువస్తే మహాకాయుణ్ణీ ఆ రాత్రే తుదముట్టించాలన్నంత కోపం వచ్చింది అతడికి.

మహాకాయుడు ఖడ్గవర్మను చూసి ఆగమన్న సూచనగా చేతులు పైకెత్తి, "నా బావమరిది మాటలు అంతగా పట్టించుకోకు. ఎంతో కాలంగా నా బోటి గంధర్వుడి సాహచర్యంలో వున్నా, వీళ్ళ మనిషి బుద్ధులు మారలేదు. ఆడుకోవటానికి వచ్చిన పెంపుడు సింహాన్ని చూసి, వీడి అక్క ప్రాణభయంతో పరిగెత్తింది. వీడు అరణ్యంలో మీ చేత ఒళ్ళు హూనం చేయించుకుని, నా ఆసరాతో మిమ్మల్ని సాధించాలని చూస్తున్నాడు. ఏమైనా యీ రాత్రికి మీరు నా అతిథులు. పోయి పడుకో. ఈ కుర్రకుంక సంగతి నేను చూస్తాను," అన్నాడు.

ఖడ్గవర్మ మారు మాట్లాడకుండా వెనుదిరిగి గదిలోకి పోయి, తలుపు మూసేశాడు. బయట చెలరేగిన గలభా అంతా ఆలకిస్తున్న జీవదత్తుడు, ఖడ్గవర్మ గదిలోకి రాగానే,





"ఏమిటి, ఖడ్గా! ఆ మహాకాయుడు తాను గంధర్వుణ్ణని చెప్పినట్టుందే!" అన్నాడు సాలోచనగా.

"....అనే చెపుతున్నాడు. నయం.... దేవుణ్ణనలేదు!" అంటూ ఖడ్గవర్మ కత్తిని తిరిగి ఒరలో పెట్టి పక్కమీదికి పోయి పడుకున్నాడు.

"ఖడ్గా, అతడి మాటల్ని మరీ అంత చులకనగా కొట్టెయ్యకు. అంత ఆజాను బాహువూ, సింహాల్నీ, పులుల్నీ మచ్చిక చేసి వేట కుక్కల్లాగా ఉపయోగించేంత శక్తి వున్నవాడూ — కేవలం మామూలు మనిషై వుండడు. మిగతా ప్రపంచంతో సంబంధం లేకుండా అతడు యీ రహస్య ప్రదేశంలో వుంటున్న తీరు చూశావా?" అన్నాడు జీవదత్తుడు.

"నీ మాటలు వింటూంటే, యీ మహాకాయుడు తాను చెపుతున్నట్టు గంధర్వుడు కాకపోయినా, ఏదో అర్ధ గంధర్వుడైనా అయి వుంటాడని అనుమానం కలుగుతున్నది. రేపు ఉదయం జరగబోయే ద్వంద్వయుద్ధంలో అతణ్ణి తేలిగ్గా నువ్వు జయించగలవు గదా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

ఆ ప్రశ్నకు జీవదత్తుడు పెద్దగా నవ్వి, "జయించగలను. కాని తేలిగ్గానా, లేక ఎంతో శ్రమపడా అన్నది యిప్పుడు చెప్పటం కష్టం. నేను నా యుద్ధ ప్రావీణ్యాన్నేకాక, మంత్రశాస్త్ర పాండిత్యాన్ని కూడా పూర్తిగా ఉపయోగించవలసి రావచ్చు. అతణ్ణి చంపకుండా లోబరుచుకుని, అతణ్ణుంచి కొన్ని రహస్యాలు లాగవచ్చనుకుంటాను. అతడు నిజంగా గంధర్వుడైతే వింధ్యపర్వత ప్రాంతాల్లో వున్న రాతిరథాన్ని గురించిన సమాచారం మనకు కొంత చెప్పగలడు," అన్నాడు.

"నువ్వు ఊహించేదంతా నిజం అయితే ఎంత బావుంటుంది! ఆ రాతిరథాన్ని వెతికే శ్రమ తప్పుతుంది. సరే, నాకు నిద్ర ఆగటం లేదు," అంటూ ఖడ్గవర్మ కళ్ళు మూసుకున్నాడు.

జీవదత్తుడు మర్నాటి ఉదయం తాను మహాకాయుడితో చేయనున్న యుద్ధాన్ని గురించి ఆలోచించుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు.

సూర్యోదయం అవుతూండగానే మహాకాయుడు వచ్చి ఖడ్గ జీవదత్తులు నిద్రిస్తున్న గది తలుపు తట్టాడు. ఖడ్గవర్మ వెళ్ళి తలుపు తీశాడు. మహాకాయుడు అతడికి మిట్టకోట దిగువున వున్న ఒక కొండ వాగు గురించి చెప్పి, "ఆలశ్యం కాకుండా స్నానాలూ అవీ ముగించుకు రండి. నేను వేటకు వెళ్ళే లోపలే మిమ్మల్ని నా పెంపుడు జంతువులకు ఆహారంగా వేయాలి!" అన్నాడు.

"ఓహోఁ, రాత్రి గడిచిపోయింది గనక యిక మేం నీకు అతిథులం కాదన్న మాట! సరే, ఒక గంట లోపలే వస్తాం, నువు యుద్ధానికి సిద్ధంగా వుండు!" అన్నాడు ఖడ్గవర్మ.

మహాకాయుడు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఖడ్గవర్మ తన మిత్రుణ్ణి నిద్ర లేపి, మహాకాయుడు పలికిన పరుష వాక్కుల సంగతి చెప్పాడు. జీవదత్తుడు మౌనంగా తలాడించి వూరుకున్నాడు. తరవాత యిద్దరూ భవనం మెట్లు దిగి మైదాన ప్రదేశం దాటి ఒక కొండవాగును చేరారు. అక్కడ వాళ్ళు వాగులో స్నానాలు చేసి,




దాపుల నున్న ఫలవృక్షాల నుంచి కాయలు కోసుకు తిని, తిరిగి మిట్టకోట కేసి బయలుదేరారు.

మిట్టకోట కింద వున్న పశువుల కొట్టాల దగ్గిర మహాకాయుడూ, అతడి భార్యా, గండ్ర గొడ్డలి యువకుడూ వాళ్లకు ఎదురయ్యారు. మహాకాయుడు జీవదత్తుణ్ణి పలకరించి, "ఇదుగో, యీ పక్కనే వున్న అశ్వశాలలో నుంచి నీకు నచ్చిన అశ్వాన్ని తీసుకో," అన్నాడు.

జీవదత్తుడూ, ఖడ్గవర్మా అశ్వశాలలో ప్రవేశించారు. అక్కడ వాళ్ళకు పదీ పన్నెండు ఉత్తమజాతి అశ్వాలు కనిపించినై. జీవదత్తుడు వాటి వీపుల మీద చేతితో




గట్టిగా తట్టి చూసి బలం, వేగం రెండూ వున్నవని భావించిన ఒక అశ్వాన్ని కట్టు విప్పి బయిటికి తీసుకు వచ్చాడు.

మహాకాయుడు జీవదత్తుడు తెచ్చిన అశ్వాన్ని చూసి, "ఆహా, నువు నా దగ్గిర వున్న అశ్వాల్లో ఉత్తమమైనదాన్నే ఎన్నుకున్నావు. ఎన్నో ఏళ్ళ కిందట నా తలిదండ్రులు దీని పూర్వీకుడి మీదే ఎక్కి, వింధ్యపర్వత ప్రాంతాల నుంచి యిక్కడికి వలస వచ్చారు," అన్నాడు.

"అలాగా! అయితే నీ బల గర్వం పోగొట్టిన తరవాత నేను దీని మీదే స్వారీ అయి, నా మిత్రుడితో ఆ పర్వత ప్రాంతాలకే పోతాను," అన్నాడు జీవదత్తుడు.

ఆ మాట మహాకాయుడికి చాలా కోపం తెప్పించింది. అతడొకసారి మీసం మెలివేసి, జీవదత్తుడి కేసి గుడ్లురుముతూ చూసి అశ్వశాలలోకి పోయి, అశ్వాన్నొకదాన్ని బయిటికి తెచ్చాడు. తరవాత అతడి అజ్ఞ కాగానే గంద్రగొడ్డలి యువకుడు రెండు అశ్వాలకూ జీను వేసి, కళ్ళాలు తగిలించాడు. మహాకాయుడూ, జీవదత్తుడూ తమ తమ అశ్వాలను ఎక్కి కూర్చున్నారు. మహాకాయుడి చేతిలో ఒక గద వున్నది. జీవదత్తుడి చేతిలో ఎప్పుడూ వుండే దండం మాత్రమే వున్నది.

"ఇంతవరకూ నీ పేరేమిటో నాకు తెలియదు. నిన్ను యమపురికి పంపే ముందు పేరు తెలుసుకోవాలని వున్నది. నీ పేరేమిటి?" అని అడిగాడు మహాకాయుడు.

"నా పేరు జీవదత్తుడు, నా మిత్రుడి పేరు ఖడ్గవర్మ. నిన్ను నేను చంపదలచుకోలేదు. కాళ్లూ చేతులూ విరగ్గొట్టి వదలదలుచుకున్నాను. అయినా పేరు తెలుసుకోవటం మంచిది గదా. నీ పేరేమిటి?" అన్నాడు జీవదత్తుడు.

"నా పేరు వసుమతి. ఇంకో క్షణంలో యీ లోకాన్ని వదలబోయే నీకు నా పేరు తెలుసుకున్నందువల్ల ప్రయోజనం ఏమిటి? కాచుకో!" అంటూ మహాకాయుడు గద పైకెత్తి గుర్రాన్ని ముందు కురికించాడు.

ఆ రెండు గుర్రాల మధ్యా దాదాపు నూరడుగుల దూరం వున్నది. వసుమతి తన గుర్రాన్ని అదిలించగానే, జీవదత్తుడు కూడా తన గుర్రాన్ని అదిలించాడు. రెండూ వేగంగా ముందుకు దూకినై. వసుమతి తనను సమీపిస్తుండగా, జీవదత్తుడు తన గుర్రం కళ్ళెం పక్కకు లాగి, వసుమతి గుర్రం తన గుర్రం పక్కగా పోయే సమయంలో తన దండంతో, వసుమతి తల మీద బలంగా కొట్టాడు. వసుమతి గదతో జీవదత్తుడి తల మీద కొట్టాలని చూశాడు గాని, జీవదత్తుడు చప్పున తల వంచుకుని ఆ దెబ్బ తప్పుకున్నాడు.

జీవదత్తుడి దండం దెబ్బతో వసుమతి తల గిర్రున తిరిగి పోయింది. సామాన్య మానవుడి చేతికి అంత బలం వుంటుందా అనిపించిం దతడికి. బహుశా ఆ దండంలో ఏదో మంత్రశక్తి వుండవచ్చను కున్నాడతడు. లేకపోతే సాధారణ యువకు డొకడు తన మీద ద్వంద్వయుద్ధానికి తల పడటం అంటే ఎన్ని గుండెలు కావాలి?

ఈ సారి వసుమతి తన గుర్రాన్ని జీవదత్తుడి కేసి దూకిస్తూ, "ఓ జీవదత్తా! నువ్వు చూడబోతే క్షత్రియ యువకుడి వేషంలో వున్న బ్రాహ్మణ మంత్రవేత్తలా వున్నావు. నిజం చెప్పు, నువు క్షత్రియుడివా, బ్రాహ్మణుడివా? బ్రాహ్మణుడివైనా నిన్ను చంపక వదలను," అంటూ గదను ముందుకు సాచి జీవదత్తుడి గుండెల మీద పొడవబోయాడు.



జీవదత్తుడు ఏదో మంత్రాన్ని పెద్ద గొంతుతో ఉచ్చాటన చేస్తూ వసుమతి గదను ఎడమచేత్తో పక్కకు తోసి, కుడి చేతిలో వున్న దండంతో గుర్రం మెడ మీద గట్టిగా మోదాడు. ఆ దెబ్బకు గుర్రం తల నేలను తాకింది. దాని వెనకకాళ్ళు రెండూ గాలిలోకి లేచినై. అది దభీమంటూ ముందుకు పడేలోపల వసుమతి పట్టు తప్పి, దానికన్న ముందుగా నేల మీద పడి అరుస్తూ అంతదూరం దొర్లుకుపోయాడు.

జీవదత్తుడు తన గుర్రం మీదినుంచి దూకి, లేచి నిలబడేందుకు ప్రయత్నిస్తున్న వసుమతిని సమీపించి దండం ఎత్తి, "ఈ పాటుకు ఏదో ఒక్క కాలు మాత్రమే విరిగిందనుకుంటాను. ఆ గద పట్టుకునే చెయ్యి కూడా వీరగ్గొట్టమంటావా? లేక లొంగిపోతావా?" అన్నాడు.

వసుమతి మౌనంగా మరొకసారి లేచి నిలబడే ప్రయత్నం చేశాడు. కాని, సాధ్యం కాలేదు. అప్పుడతడు, జీవదత్తుడి ముఖం లోకి ఏ మాత్రం కోపం లేకుండా చూస్తూ, "విరిగింది కాళ్లూ చేతులూ కాదు, నా నడుం. నువ్వే గెలిచావు! నీ మంత్రశక్తికీ, బాహు బలానికీ మెచ్చుకున్నాను. నీ బోటి వాడు ఒక్కడున్నట్టయితే, యక్షులకు ఓడి నా తండ్రిలాంటి వాళ్ళు వింధ్యపర్వతాలు వదిలి యిక్కడికి పారిపోయి రావటం జరి గేది కాదు," అన్నాడు.

పసుమతి మాటలకు జీవదత్తుడు ఆశ్చర్య పోతూ ఏదో అనబోయేంతలో ఖడ్గవర్మ పెద్దగా కేక పెట్టటం వినిపించింది. అంత వరకూ యీ ద్వంద్వయుద్ధాన్ని చూస్తూ నిలబడిన గండ్రగొడ్డలి యువకుడు, తన బావ నేల కూలగానే, ఎక్కడలేని కోపంతో జీవదత్తుణ్ణి చంపేందుకు గొడ్డలి ఎత్తి అతడి కేసి రాసాగాడు. ఖడ్గవర్మ ఆగమని ఒక సారి అతణ్ణి హెచ్చరించి, అందువల్ల ప్రయోజనం లేక పోవటంతో ముందుకు దూకి, కత్తి పిడితో అతడి తల మీద గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు యువకుడు ఒక చావుకేక పెట్టి విరుచుకుని ముందుకు పడిపోయాడు. —(ఇంకా వుంది)






# వైద్య పరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఏ దురాశాపరుడు నిన్ను తన మాటలతో మభ్యపెట్టి నీ చేత ఇలా శ్రమ చేయిస్తున్నాడో తెలియదు. అలాంటివాళ్ళ మాటలను నమ్మక, మణివర్మ లాగా వారిని పరీక్షించడం అవసరం. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు మణివర్మ కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు పురందర దేశాన్ని మణివర్మ అనే రాజు పాలించాడు. అతని రాజ్యం సంపన్నంగానూ, సుభిక్షంగానూ ఉండేది. ప్రజలకు సుఖశాంతు లుండేవి. కాని మణివర్మకు మాత్రం సుఖమూ, శాంతీ కూడా లేవు. ఆయన ఎంతకూ నయంకాని రాచ

## బేతాళ కథలు



పుండుతో బాధపడుతూ వచ్చాడు. అనేక దేశాల నుంచి మేటివైద్యులు వచ్చి చికిత్సలు చేశారు, కాని ఆ రాచపుండు నయం కాలేదు.

ఇక తన వ్యాధి నయం కాదనీ, తాను ఆ రాచపుండుతో తీసుకుని చావవలసిందేననీ మణివర్మ నిరాశ చెంది ఉండగా ఆయన వద్దకు ఎక్కడి నుంచో ఒక వైద్యుడు వచ్చి, ఆ రాచపుండును తాను నయం చేస్తానన్నాడు.

ఇలా ఎందరో వైద్యులు అని ఉండటం మూలాన రాజు ఏ మాత్రం ఉత్సాహం చూపలేదు. కాని వైద్యుడు ఆయనను వదిలి పెట్టలేదు. రాజు చివరకు విసిగిపోయి, "మందుకు ఖర్చు ఎంత అవుతుంది ?" అని అడిగాడు.

"మహారాజా, రెండువేల వరహాలు మందుకు ఖర్చవుతుంది," అన్నాడు వైద్యుడు.

"మందు తయారు చెయ్యటానికి ఎంత కాలం పట్టుతుంది ?" అని రాజు అడిగాడు.

"నెల రోజులు పట్టుతుంది," అన్నాడు వైద్యుడు.

రాజు ఆ వైద్యుడికి రెండువేల వరహాలు ఇప్పించి, రాజభవనానికి సమీపంలోనే వైద్యుడికి విడిది ఏర్పాటు చేయించాడు. వైద్యుడు ఆ విడిదిలో సమస్త సౌకర్యాలూ అనుభవించసాగాడు.

రెండు మూడు రోజులు గడిచాయి. ఒక నాడు వైద్యుడి వద్దకు ఒక నిరుపేద వచ్చాడు. అతని గడ్డం మాసి ఉన్నది. అతని దుస్తులు చిరిగి ఉన్నాయి. అతను వైద్యుడితో, "అయ్యా, వైద్యుడా! రాచపుండుతో మహాబాధ పడుతున్నాను. రాజాధి రాజులకు రావలసిన రాచపుండు నన్ను పట్టిపీడిస్తున్నది. ఏ జన్మలో చేసుకున్న పాపమో నన్ను ఇలా కట్టికుడుపుతున్నది. మీకు సాధ్యమైతే దీని కేదన్నా చికిత్స చేసి పుణ్యం కట్టుకోండి," అన్నాడు.

వాణ్ణి చూసి వైద్యుడికి జాలివేసింది. "నాయనా, నీ వ్యాధి సులువుగా నయ

మవుతుంది. నేను చెప్పినట్టు చెయ్యి. ఇక్కడికి రెండు యోజనాల దూరంలో ఒక సరస్సు ఉన్నది. దాని పడమటి గట్టున చంద్రముఖి అనే చెట్టున్నది. దాని ఆకులు అర్ధచంద్రాకారంతో, ఒక విధమైన సువాసన కలిగి ఉంటాయి. తెల్లవారుజామునే దాని ఆకులు పిడికెడు కోసి, వాటిని నమిలి మింగు. ఆ ఆకులే నూరి పుండు పైన పట్టించు. మూడు రోజులలో పుండు మాని పోతుంది. సుఖంగా వుంటావు," అని వైద్యుడు ఆ పేదవాడికి చెప్పాడు.

పేదవాడు వైద్యుడికి ధన్యవాదాలు చెప్పి వెళ్ళిపోయాడు

నెల రోజులు పూర్తికాగానే వైద్యుడు రాచపుండుకు మందు తయారు చేసి తీసుకు పోయి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, తమ రాచపుండుకు మందు తయారు చేసి తెచ్చాను," అన్నాడు.

"నా రాచపుండు అప్పుడే నయమయిందే. ఇంక మందూ మాకు ఎందుకు?" అన్నాడు రాజు.

వైద్యుడు నిర్ఘాంతపోతూనే, "చాలా సంతోషం, మహారాజా! తమకు ఎవరు చికిత్స చేశారు?" అని అడిగాడు.

"నాకు చికిత్స చెప్పినది నువే కాదుటయ్యా? నీ దగ్గిరికి ఆ నాడు వచ్చిన పేదవాణ్ణి నేనే!" అన్నాడు రాజు.

తరవాత రాజు వైద్యుడికి యాభైవేల వరహాలు కానుక ఇచ్చి, ఘనంగా సత్కరించి పంపేశాడు.



బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మణివర్మ వైద్యుడి వద్దకు పేదవాడి వేషంలో ఎందుకు వెళ్ళాడు? వైద్యుడు తన వద్ద నుంచి మందుకు హెచ్చు డబ్బు తీసుకుంటున్నాడేమో తెలుసుకునేందుకా? అలా అయితే అదే వైద్యుడికి యాభైవేల వరహాలిచ్చి ఎందుకు సత్కరించాడు? తనతో అబద్ధం చెప్పిన వైద్యుణ్ణి రాజు ఎందుకు శిక్షించలేదు? ఏమీ ఖర్చు లేకుండా కొద్ది నిమిషాలలో తయారయే మందు కోసం వైద్యుడు రెండువేల వరహాలూ, నెలరోజులు గడువూ ఎందుకు అడిగాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మణివర్మకు వైద్యులలో విశ్వాసం పూర్తిగా పోయిన సమయంలో ఈ వైద్యుడు వచ్చాడు. మామూలు మూలికతో వ్యాధి నయమవుతుందంటే ఆయన నమ్మడు. తాను ఇవ్వబోయే ఔషధం చాలా విలువైనదనీ, ఒకంతట తయారు కాదనీ అంటే తప్ప రాజుకు గురి కుదరదు. అందుచేత వైద్యుడు అబద్ధం ఆడాడు. రాజు పేదవాడి వేషంలో వెళ్ళటానికి కారణం, రాచపుండుకు చికిత్స ఉన్నదన్న నమ్మకం లేకపోవటం. ధనాశ చేత వైద్యుడు తనకు లేనిపోని ఆశ చూపి ఉండవచ్చు. అదే వ్యాధితో ఒక పేదవాడు వచ్చినట్టయితే ఆ వైద్యుడు రాచపుండుకు చికిత్స లేదని నిజం చెప్పవచ్చు. ఆ నిజం తెలుసుకునేటందుకే రాజు పేదవాడి వేషంలో వైద్యుడి వద్దకు వెళ్ళాడు. వైద్యుడు చికిత్స చెప్పిన మీదట రాజుకు, వైద్యుడు అబద్ధం ఎందుకు చెప్పినదీ అర్థమయింది. రాజుకు కావలసినది చికిత్స—వైద్యుడు నిజం చెప్పటం కాదు. చికిత్స జరిగింది గనక ఆయన వైద్యుణ్ణి సత్కరించి పంపాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# పంచకల్యాణి

## 4

శ్యామలనగరం రాజు అడిగిన దానికి వీరదాసు యిల్లా చెప్పసాగాడు:

రాక్షసుడి గుహ నుంచి వచ్చిన కొద్ది కాలానికే నాకు మా వాళ్ళు పెళ్ళి చేశారు. నేను కూడా సంచారాలు కట్టి పెట్టి ఇంటి పట్టునే ఉంటూ వచ్చాను.

కాని, తిరిగే కాలు ఊరుకుంటుందా? ఒకనాడు సముద్రతీరాన వేటాడబోయాను. సముద్రం ఒడ్డున ఒక అందమైన పడవ కనిపించింది. అది ఏమిటో చూద్దామని అందులోకి ఎక్కాను. దానిలోపల ఎంతో విలువగల వస్తువులూ, అందమైన వస్తువులూ అనేకంగా ఉన్నాయి. నేను వాటిని చూసి ఆనందపడే సమయంలో పడవ దానికదే కదిలి సముద్రం మీదికి ప్రయాణమయింది.

నేనీ సంగతి గమనించేసరికి పడవ సముద్రం మీద అమితవేగంగా పోతున్నది. కాని నేనేమీ కంగారు పడలేదు. అది అలా వెళ్ళి వెళ్ళి ఒక దీవిని చేరుకుని, దాని ఒడ్డును ఒరుసుకుని ఆగిపోయింది. ఆ దీవి నేనెన్నడూ చూడలేదు. అక్కడ ఏమున్నదో చూదామని పడవలో నుంచి ఒడ్డుకు దిగాను. వెంటనే ఆ పడవ గిరుక్కున తిరిగి, వచ్చిన దారినే వెళ్ళిపోయింది. నేనా దీవి మీద చిక్కుపడిపోయాను.

దీవి మీద ఎక్కడా నరసంచారం ఉన్నట్టు లేదు. కనుచూపు మేరలో ఒక్క ఇల్లు కూడా లేదు. నేను సముద్రతీరం నుంచి ఒక గుట్ట ఎక్కేసరికి, ఆ ఎత్తున పీఠభూమి కనబడింది. నేనక్కడికి చేరుతూనే స్తంభించిపోయాను. ఎందుకంటే, చెట్ల మధ్య ఖాళీస్థలంలో ఒక స్త్రీ ఒక పసిపిల్లవాడి కంఠానికి కత్తిమొన ఆనించి, పొడవబోతున్నది!

టి. వెంకటరావు



ఆ పిల్లవాడు కేరింతాలు కొడుతూ, తళ తళలాడే ఆ కత్తిని తన చిన్న చేతులతో పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. అది చూసి ఆ స్త్రీ కత్తి అవతల విసిరేసి, గుండె పగిలేటట్టు ఏడుస్తూ, "నా వల్ల కాదు! నా వల్ల కాదు!" అన్నది.

నే నామె దుస్థితి గ్రహించి, దగ్గిరికి వెళ్ళి, "ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాను.

ఆమె నా గొంతువిని, పిల్లవాణ్ణి తన గుండెకు అదుముకుంటూ లేచి, పారి పోబోయింది. కాని నేను పరిగెత్తి వెళ్ళి ఆమెను చేరుకుని, "భయపడకు. నేనూ నీ స్థితిలోనే ఉన్నాను," అన్నాను.

"అది నిజమే. కాని ఇక్కడికి ఎలా వచ్చావు?" అని ఆమె అడిగింది.

నేను నా అనుభవమంతా చెప్పాను.

"నేను కూడా నీలాగే ఇక్కడికి అనుకో కుండా వచ్చి చేరాను. పిల్లవాణ్ణి ఎత్తుకుని సముద్రతీరాన నడుస్తూ పడవను చూసి, నేరక అందులోకి అడుగు పెట్టాను. ఏమి జరిగినదీ తెలుసుకునే లోపల పడవ ఈ దీవికి చేరనే చేరింది. దీవిలోకి అడుగు పెట్టటం ప్రమాదమని నేను కలలో కూడా అనుకో లేదు. నేను దిగిన మరుక్షణం పడవ వెళ్ళి పోయింది. ఇక్కడ చిక్కుపడిపోయాను. నువ్వయినా ఇక్కడి నుంచి తప్పించుకు పోలేవు," అన్నదామె.

ఆమె వెనకగా నేను రాళ్ళతో కట్టిన ఒక వంట ఇంట్లోకి నడిచాను. అందులో ఒక పక్కగా పెద్దగంగాళం ఉన్నది. దాని కింద కొద్దిపాటి మంట ఉన్నది.

"నీ కొడుకును ఎందుకు చంప బోయావు?" అని అడిగాను.

"నా ప్రారబ్ధం ఏమని చెప్పను? వీణ్ణి రాక్షసుడికి వండి పెట్టాలి. అందుకే గంగాళం కింద మంటచేశాను," అన్నదామె కన్నీరు కారుస్తూ.

నీరు త్వరగా మరగకుండా మంట చిన్నది చేసిందిట. కాని రాక్షసుడు వచ్చి మంట పెద్దది చేస్తాడు.

ఆమె ఆ మాట అంటూండగానే భూమి అదిరింది. రాక్షసుడు దూరాన వస్తున్నట్టు తెలిసింది.

"ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?" అని ఆమె లబలబలాడింది.

"నీ పిల్లవాణ్ణి ఎక్కడన్నా దాచు! నేను గంగాళంలో కూర్చుంటాను," అంటూ నేను గంగాళంలోకి చేరి, పైన మూత వేసుకున్నాను. అదృష్ట వశాన నీరు ఇంకా అంతగా వేడెక్కలేదు.

రాక్షసుడు వస్తూనే ఆమెను, "పిల్లవాణ్ణి ఉడకబెట్టావా?" అని అడిగాడు.

"ఇంకా నీరు మసులు పట్టలేదు," అన్నదామె.

నేను నీటిలో నుంచి బుడగల చప్పుడు చేశాను. అది పిల్లవాడే చేస్తున్నాడనుకుని, రాక్షసుడు పొట్ట ఎగిరేటట్టు నవ్వుతూ, గంగాళం కింద మంట పెద్దది చేసి, దాని పక్కనే నడుము వాల్చాడు.

క్రమంగా గంగాళంలో నీరు వేడెక్క సాగింది. నేను అందులో ఉడకక తప్పదనుకున్నాను. గంగాళం కింది భాగం భరించరానంతగా వేడి ఎక్కింది.

ఇంతలో రాక్షసుడు గురకపెట్టనారంభించాడు లాగుంది. ఆమె గంగాళం మూత ఎత్తి, "బతికి ఉన్నావా?" అని రహస్యంగా అడిగింది.



"కొనప్రాణం ఇంకాపోలేదు," అన్నాను, మూత ఎత్తి, గంగాళంలో లేచి నిలబడి. రాక్షసుడు మంచి నిద్రలో ఉన్నాడు. నేను గంగాళంలో నుంచి శ్రమపడి దిగాను. కాని తరవాత ఏం చెయ్యాలి?

ఆమె సైగచేసి, రాక్షసుడి పక్కన ఉన్న బల్లెం చూపించింది. అది చాలా పెద్దది. నేను ఆ బల్లెం పట్టుకుని ఎత్తాను. అది చాలా బరువుగా ఉన్నది. ఎలాగూ చావు తప్పేదారి లేదు. ఆ బల్లాన్ని రెండుచేతులా ఎత్తి, నా కున్న శక్తి అంతా ఉపయోగించి రాక్షసుడి కళ్ళమధ్య దిగవేశాను. అది వాడి తలను దూసుకుని, జానెడు లోతున భూమిలోకి దిగబడి పోయింది. రాక్షసుడు

కిక్కురుమనకుండా చచ్చాడు. నా ఆనందం ఏమని చెప్పను!

ఆ స్త్రీనీ, పిల్లవాణ్ణీ వెంట బెట్టుకుని సముద్రతీరానికి వచ్చాను. అక్కడ పడవ సిద్ధంగా ఉన్నది. మేం దానిమీద ఎక్కేసరికి, అది బయలుదేరి, తిరిగి మా తీరానికి వచ్చేసింది. తరవాత ఆమె దారిన ఆమె పిల్లవాడితో సహా వెళ్ళిపోయింది.

వీరదాసు ఈ సంఘటన చెప్పి, "ఈ సంఘటనను మహారాజుగారు నమ్ముతారో, లేదో!" అన్నాడు.

అదేక్షణంలో, రాజుగారి వెనక ప్రాంతం నుంచి ఒక వయసు మళ్ళిన స్త్రీ ముందుకు వచ్చి, "ఆ నాడు నన్ను ఆ రాక్షసుడి నుంచి కాపాడిన వాడివి నువేనా నాయనా?" అన్నది ఆశ్చర్యంతో.

వీరదాసు ఆమెను కొంచెంగా గుర్తు పటుతూ, "అవునమ్మా, నేనే!" అన్నాడు.

"ఈ రాజే ఆ నాడు నువు రక్షించిన కుర్రవాడు! నీకు మేమిద్దరమూ ఎంతగా రుణపడి ఉన్నామో!" అన్నదామె.

ఇన్నిఏళ్ళ తరవాత వాళ్ళు మళ్ళీ తిరిగి కలుసుకోవటం ఎంతో ఆనందం కలిగించింది.

"వీరదాసూ, నువు నిజంగా గొప్ప ధీరుడివి. నీకు కలిగిన ప్రమాదాలు సామాన్యమైనవి కావు. నా పంచకల్యాణి గుర్రం నీదే. దానితోబాటు నా ఖజానాలో ఉన్న అమూల్యమైన రత్నాలన్నీ నీకు బహుమానంగా యిస్తాను," అన్నాడు శ్యామల నగరరాజు.

ఆ రాత్రి వీరదాసు గౌరవార్థం పెద్ద విందు జరిగింది.

మర్నాడు అతను రాజుకూ, రాజమాతకూ వీడ్కోలు చెప్పి, తన కొడుకులతోనూ, పంచకల్యాణి గుర్రంతోనూ, శ్యామలనగరరాజు ఇచ్చిన కానుకలతోనూ బయలుదేరి తన నగరానికి తిరిగి వచ్చాడు.

పంచకల్యాణి లభించినాక అతని ప్రభువు అతని కొడుకులను క్షమించి, సుఖంగా జీవించనిచ్చాడు.

—(అయిపోయింది)






# దైవనిర్ణయం

బస్రానగరంలో మజీద్ అనే యువకుడు ఉండేవాడు. వాడు అమిత సోమరి. మొండి ఘటం. మజీద్ తల్లిదండ్రులను తప్ప ఎవ్వరినీ లెక్ఖ చేసేవాడు కాడు.

మజీద్ తండ్రి ఒక దర్జీ. అతని సంపాదనతోనే సంసారం గడిచేది. ఒకరోజు మజీద్‌తో వాడి తండ్రి, "ఒరే, నీ వేషాలు చూస్తే విసుగెత్తుతున్నదిరా. నువు వెళ్ళి హస్సన్ బస్రీగారు చెప్పే బోధలన్నా విను, బాగుపడతావేమో!" అన్నాడు.

హస్సన్ బస్రీ అనే మతగురువు బస్రానగరంలోనే ఉండి, ప్రజలకు జ్ఞానబోధ చేస్తూ ఉండేవాడు. మజీద్ వెళ్ళేసరికి ఆయన తన శిష్యులకు ఇలా బోధిస్తున్నాడు:

"ప్రతి ప్రాణికీ తిండీ, తీర్థమూ ప్రసాదించేది భగవంతుడే. ఎవరి కెంత ఇవ్వాలో, ఎలాటి మేలు చేకూర్చాలో ఆయనకు బాగా తెలుసు. ఆయన నిర్ణయాన్ని ఏ శక్తీ మార్చలేదు: అది తప్పక ముమ్మాటికీ జరిగి తీరుతుంది."

మజీద్ ఈ మాట విని గురువును సమీపించి, "హజ్రత్, ఇప్పుడు మీరు చెప్పిన దానికి అర్థమేమిటి? కాస్త వివరించి చెప్పండి," అని అడిగాడు.

హస్సన్ బస్రీ చిరునవ్వు నవ్వి, "నాయనా, భగవంతుడు నీ చేత ఏదన్నా తినిపించా లనుకుంటే నువ్వు దాన్ని తిని తీరుతావు. అలా జరగకుండా చెయ్యటం ఎవరి తరమూ కాదు," అన్నాడు.

"అలాగా? ఐతే భగవంతుడు నా చేత ఇవాళ ఏం తినిపిస్తాడో చెప్పండి," అని మజీద్ వేళాకోళంగా అడిగాడు.

హస్సన్ బస్రీ వాడి కేసి ఎగాదిగా చూసి, "నీకు ఇవాళ పాయసం తినాలని రాసిపెట్టి ఉన్నది. నువు ఇవాళ పాయసం తింటావు," అన్నాడు.

కె. అస్వర్



"రాసిపెట్టిఉన్నదా ! సరే, తినకపోతే ?" అన్నాడు మజీద్.

"నీకు అలాంటి సందేహమే వద్దు. ఇవాళ నువు నిస్సందేహంగా పాయసం తింటావు," అన్నాడు హస్సన్ బస్రీ.

"నేను తినకూడదనుకుంటే ?" అని మజీద్ మళ్ళీ అడిగాడు.

"తినాలనుకున్నా తింటావు; తినకూడదనుకున్నా తింటావు," అన్నాడు హస్సన్ బస్రీ ఖచ్చితంగా.

"చచ్చినా ఇవాళ పాయసం తినను. భగవంతుడు నా చేత ఎలా తినిపిస్తాడో నేనూ చూస్తాను," అంటూ మజీద్ కోపంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఇంటికి పోతే తన తల్లి పాయసం చేసి తినమనవచ్చు. లేదా ఇరుగు పొరుగు వారెవరైనా పాయసం తెచ్చి ఇస్తే తాను తినవలసి రావచ్చు. అందుకని మజీద్ అడవి కేసి బయలుదేరాడు. వాడు ఊరు విడిచి, నిప్పు లాగా కాలుతున్న ఇసుకలో పదిమైళ్ళు నడిచి, ఒక చెట్టు నీడ చేరుకుని సేద తీర్చుకోసాగాడు.

ఇంతలో వాడికి బాటసారు లెవరైనా వచ్చి, తనను పాయసం తినమని బలవంత పెట్టవచ్చునని భయం పుట్టింది. వెంటనే వాడు చెట్టెక్కి, ఆకుగుబుర్ల మధ్య ఎవరికీ కనిపించకుండా కూచుని, చిన్న కునుకు తీశాడు.

ఒక గంట గడిచాక ఒక పెళ్లిపఠాలం బస్రా పోతూ అటుగా వచ్చింది. చెట్టునీడ చూడగానే వాళ్ళకు ప్రాణం లేచి వచ్చింది. ఆడామగా, పిల్లాజెల్లా అంతా ఆ చెట్టునీడలో మజిలీ వేశారు. ఒంటెలను చెట్టుకు కట్టి మేత వేసి, భోజనాల వేళ కావటంచేత ఏదైనా వంటకం చేసుకు తిని, మరీ బస్రానగరం కేసి బయలుదేర నిర్ణయించుకున్నారు వాళ్ళు.

అందరూ తలా ఒక వంటకమూ సూచించారు. కాని అన్నిటికన్న పాయసం చేయటం తేలిక గనక అదే చెయ్యటానికి నిర్ణయం జరిగింది. వెంటనే రాళ్ళతో

పొయ్యి చేసి, దాని కింద మంటపెట్టి పాయసం వండారు. త్వరలోనే ఘుమ ఘుమలాడే పాయసం తయారయింది.

అందరూ ఆ పాయసం ఆరగించే ప్రయత్నంలో ఉండగా గుర్రాల మీద కొందరు దొంగలు అటు కేసి రావటం కనిపించింది. పెళ్లి ముఠావారు భయపడి, ఎవరికి అందిన సామాను వారు తీసుకుని, ఒంటెల మీద పారిపోయారు.

దొంగలు అక్కడికి చేరేసరికి చెట్టు కింద ఒక్క పిట్ట కూడా లేదు, అందరూ పారిపోయారు. కాని పొయ్యి మీద ఘుమఘుమలాడుతూ పాయసం మటుకు ఉన్నది.

ఆకలి మీద ఉన్న దొంగలకు పాయసం చూడగానే ప్రాణాలు లేచి వచ్చాయి.

"ఎవరో మన కోసం ఈ పాయసం వదిలి వెళ్ళారు. దీన్ని తిని పోదాం," అన్నాడు ఒక దొంగ.

"ఆగండి! ఆ పాయసం ముట్టుకోకండి!" అని దొంగలనాయకుడు పెద్దగా అరిచాడు.

అందరూ అతని కేసి ప్రశ్నార్థకంగా చూశారు.

"మీ కేమన్నా మతి పోయిందా? ఇంత పాయసాన్ని ఎవరన్నా వదిలి వెళ్ళిపోతారా? మనని చంపటానికి ఇందులో విషం కలిపి పెట్టారు," అన్నాడు దొంగలనాయకుడు.

దొంగ లందరి మనస్సుల్లోనూ అనుమానం తలఎత్తింది. ఎవరూ పాయసాన్ని ముట్టలేదు.



"మనని చంపటానికి ప్రయత్నించిన వాళ్ళు, మనం చచ్చామో, లేదో చూడటానికి ఇక్కడే ఒక మనిషిని దాచి ఉంటారు. ఆ మనిషి కోసం వెతకండి," అన్నాడు దొంగల నాయకుడు తన అనుచరులతో.

దొంగలు మనిషి కోసం వెతకసాగారు. వారిలో ఒకడు చెట్టు మీద ఉన్న మజీద్‌ను పసిగట్టాడు. "అడుగో, చెట్టు మీద దాక్కున్నాడు!" అని వాడు అనగానే దొంగలు చెట్టు చుట్టూ చేరి పైకి చూశారు. మజీద్‌కు పై ప్రాణాలు పైనే పోయాయి.

"హజ్రత్, చెట్టు దిగండి, పాయసం తిందురుగాని!" అని దొంగల నాయకుడు మర్యాదగానే మజీద్‌ను ఆహ్వానించాడు.

దిగనని చెప్పటానికి మజీద్ తల అడ్డంగా ఆడించాడు.

దొంగల అనుమానం బలపడింది.

"ఇందులో విషం కలపబట్టే వాడు దిగిరాకుండా ఉన్నాడు. వెంటనే వాణ్ణి చెట్టు కొమ్మల్లోంచి దింపండి." అన్నాడు దొంగల నాయకుడు.

ఒక దొంగ చెట్టెక్కి, మజీద్‌ను భుజాన వేసుకుని దిగి వచ్చి, కింద పడేశాడు. మరొకడు గిన్నెలో ఉన్న పాయసం తెచ్చి, "తిను!" అన్నాడు.

"నన్ను బలవంత పెట్టకండి. నేను పాయసం తినను," అని మజీద్ ఏడవటం మొదలుపెట్టాడు.

"పాయసంలో విషం కలిపి మమ్మల్నందర్నీ చంపుదా మనుకున్నావురా?" అని దొంగలనాయకుడు తన అనుచరుల కేసి చూసి తల ఎగరవేశాడు.

వెంటనే దొంగలు మజీద్ కాళ్ళూ, చేతులూ గట్టిగా పట్టుకున్నారు. ఒకడు మజీద్ నోట్లో బలవంతంగా పాయసం పోశాడు. ఇంకొకడు ముక్కు మూసేసరికి మజీద్ గుటకవేసి పాయసం మింగాడు.

దొంగలు అంతటితో మజీద్‌ను వదలకుండా, వాడు తినగలిగి నంత పాయసం తినిపించారు. వాడు చావకపోవటం చూసి దొంగలు మిగతా పాయసం తిని, తమ దారిన వెళ్ళిపోయారు.



# ఇంద్రుడు-శని

ఒకప్పుడు శనికి ఇంద్రుడికి వాగ్వాదం జరిగింది.

"నేను మూడు లోకాలకూ అధిపతిని. చరాచరాలన్నీ నా అజ్ఞకు లోబడి ఉండి తీరాలి. అందుచేత నేనే గొప్ప," అన్నాడు ఇంద్రుడు.

"త్రిమూర్తులైనా నా పట్టు నుంచి తప్పించుకోలేరు. నేను నీకన్న గొప్పవాణ్ణి అని నిరూపించటానికి రేపు ఉదయం లగాయతు సూర్యాస్తమానం దాకా నిన్ను పట్టుతాను. చేతనైతే తప్పించుకో," అన్నాడు శని.

శని తనను పట్టకుండా ఉండగలందులకు ఇంద్రుడు మర్నాడు తెల్లవారక ముందే ఒక నిర్జనారణ్యానికి వెళ్ళి, అక్కడ ఒక చెట్టుతొర్రలో అస్తమానం అయేదాకా దాక్కున్నాడు. శని జాడలేదు. అస్తమానమయింది. ఇంద్రుడు విజయగర్వంతో చెట్టుతొర్ర నుంచి బయటపడి, శనిని చూడబోయి, "ఏదీ, నన్ను పట్టలేకపోయావే!" అన్నాడు.

"నేను పట్టబట్టే గదా త్రిలోకాలకూ అధిపతివైన నువు రోజల్లా నిర్జనారణ్యంలో ఒక చెట్టుతొర్రలో ఉండిపోయావు!" అన్నాడు శని నవ్వుతూ.

—ఎస్. రామచంద్రరావు






# వ్యాపారి యుక్తి

తామ్రలిప్తి అనే ప్రాచీన నగరంలో పూర్వం బలాకగుప్త అనే ధనిక వ్యాపారి ఉండే వాడు. శేఖరపాలు డనే ఇంద్రజాలికుడితో అతనికి గాఢమైన స్నేహం ఉండేది. బలాకగుప్తుడు వ్యాపారం మీదా, శేఖర పాలుడు తన ఇంద్రజాల ప్రదర్శనల మీదా అస్తమానమూ దేశసంచారం చేసేవారు. ఏడాదికి రెండు నెలలపాటు ఇద్దరూ ఇంటి వద్ద ఉండి ఇంద్రజాల విద్యలను గురించి చర్చిస్తూ సరదాగా కాలక్షేపంచేసేవారు.

బలాకగుప్తుడు అనేక దేశాలు తిరిగాడు గాని, ఎన్నడూ మణిపుర రాజ్యానికి వెళ్ళ లేదు. అందుచేత అతను ఒక ఏడు మణి పురానికి ప్రయాణం కట్టాడు. ఈ ప్రయాణం మానుకోమని బలాకగుప్తుణ్ణి మిత్రులు నిరు త్సాహ పరిచారు. ఎందుచేతనంటే, మణి పురానికి వెళ్ళాలంటే ఒక పర్వతపంక్తి దాటి మరీ వెళ్ళాలి. అదీకాక, దారి పొడు గునా దట్టమైన అరణ్యాలు ఉండేవి. వీటన్నిటికీ తోడు ఆ దారిన దొంగల భయం చాలా హెచ్చుగా ఉండేది.

అయినా బలాకగుప్తుడు ఎవరి మాటా లక్ష్యపెట్టక, గోపాలు డనే నౌకరును వెంట తీసుకుని, అమూల్యమైన సరుకులతో వర్తక వ్యాపారం చెయ్యటానికి మణిపురానికి బయలుదేరాడు. వాళ్ళు ఆరు రోజులపాటు నిర్విఘ్నంగా ప్రయాణం చేసి, మణిపుర రాజ్యం సరిహద్దున ఉండే పర్వతశ్రేణి దిగువ ప్రాంతాన్ని చేరుకున్నారు.

నౌకరు గోపాలుడు తన యజమానితో, "బాబూ, చీకటి పడుతున్నది. ఈ రాత్రి ఆ కనిపించే గుహలో తలదాచుకుందామా?" అన్నాడు.

"అలాగే," అన్నాడు బలాకగుప్త.

వీళ్ళు గుహలో ప్రవేశించే ప్రయత్నంలో ఉండగా గుర్రపుడెక్కల ధ్వని వినిపిం

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

చింది. మరి కొద్ది క్షణాలలో భయంకరులైన అశ్వికులు వారిద్దరినీ చుట్టుముట్టారు. వారందరి వద్దా రకరకాల అయుధాలు ఉన్నాయి.

"ఎవరు మీరు?" అని బలాకగుప్త ధైర్యంగా వాళ్ళను అడిగాడు.

"నీ పాలిటి యమకింకరులం!" అన్నాడు దొంగల నాయకుడు క్రూరంగా నవ్వుతూ.

బలాకగుప్త తన కత్తిని దూశాడు, కాని మరుక్షణమే ఇద్దరు దొంగలు అతని పైకి ఉరికి, పట్టుకున్నారు. దొంగలు బలాకగుప్త వెంట ఉన్న సొత్తు యావత్తూ కాజేసి, అతన్నీ, అతని నౌకరునూ బందీలుగా పట్టుకున్నారు. ఆ సరుకును దొంగలు పంచుకునేటప్పుడు ప్రతి ఒక్కడికీ ఏదో ఒక అమూల్యమైన వస్తువు లభించింది. అందు చేత దొంగలు చాలా సంతోషించారు.

"మీకు కావలిసినది మీకు దొరికింది. ఇక మమ్మల్ని వదిలిపెట్టండి," అన్నాడు బలాకగుప్త దొంగల నాయకుడితో.

"అది కుదరదు. నిన్ను మా కాళీమాతకు బలి ఇస్తాము," అన్నాడు దొంగల నాయకుడు.

తమ నాయకుడు సైగ చేసే సరికి దొంగలు బలాకగుప్తనూ, అతని నౌకరునూ ఒక గుహలో ఖైదు చేశారు.



పెద్ద ప్రమాదంలో చిక్కుకున్న యజమానీ, సేవకుడూ కొంతసేపు ఏమీ మాట్లాడలేదు. చివరకు గోపాలుడు, "బాబూ, మనం దీని సహాయంతో బయట పడగలమంటారా?" అంటూ ఒక రత్నాల ఉంగరం తన యజమానికి చూపాడు.

"అది నీ కెక్కడిది?" అని బలాకగుప్త గోపాలుణ్ణి అడిగాడు.

"ఒక దొంగకు వచ్చిన వాటా నుంచి అతడికి తెలియకుండా కాజేశాను," అన్నాడు గోపాలుడు.

వాళ్ళు ఇలా మాట్లాడుకుంటూ ఉండగా ఒక దొంగ వాళ్ళ కోసం అన్నమూ, నీరూ తెచ్చాడు. వాడి వెంట వచ్చిన మరి ఇద్దరు



దొంగలు గుహ బయట కత్తులు పట్టుకుని కాపలా ఉన్నారు.

లోపలికి వచ్చిన దొంగను చూసి గోపాలుడు మెచ్చుకునే ధోరణిలో, "మనిషి అంటే అలా ఉండాలి — ఒడ్డూ, పొడుగూ, కోర మీసమూ!—చూశారా, ఎలా ఉన్నాడో!" అన్నాడు బలాకగుప్తతో.

ఈ మాటకు దొంగ పొంగి పోయి, మీసం దువ్వుకుంటూ, "మీ భోజనం త్వరగా పూర్తి చెయ్యండి. నేను చాలా దూరం పోవాలి. ఈ రాత్రే మా చెల్లెలి పెళ్ళి," అన్నాడు.

"మీ చెల్లెలికి పెళ్ళి అవుతున్నదా? మా తరఫున ఆమెకు ఒక చిన్న కానుక ఇస్తావా ఏమిటి?" అంటూ బలాకగుప్త తన దగ్గర వున్న వజ్రాల ఉంగరాన్ని దొంగ చేతిలో పెట్టాడు.

దొంగా మనిషే. బలాకగుప్త తన చేతిలో వజ్రాల ఉంగరం పెట్టగానే దొంగ గుండె చెరువయింది. జటాధరు డనే పేరు గల ఆ దొంగ బలాకగుప్తతో, "మీ సొత్తు ఎలాగూ పోయింది. మీ ప్రాణాలు పోకుండా ఏదన్నా మార్గం ఉంటే బాగుండును. తప్పించుకు పోయేటందుకు ఏదన్నా మార్గం ఆలోచించండి. తెల్లవారి వచ్చి నా చేతనైన సహాయం నేను చేస్తాను," అన్నాడు.

ఆ రాత్రి బలాకగుప్త గాని, అతని నౌకరు గోపాలుడు గాని కన్ను మూయలేదు.

మర్నాడు మధ్యాన్నానికి జటాధరుడు వారిద్దరికీ భోజనంతో పాటు కొన్ని మంచి పిండి వంటలు కూడా తెచ్చి, "మీ కానుక చూసి మా చెల్లెలు మురిసిపోయింది. ఈ పిండి వంటలు మీ కోసం అమే పంపింది. ఇంతకూ మీరు పారిపోయే ఉపాయం ఏమన్నా ఆలోచించారా?" అని అడిగాడు.

"గుహ ద్వారం తెరిచి ఉంచి, రెండు గుర్రాలు గుహ వెలపల ఏర్పాటు చేస్తే మేం పారిపోతాం," అన్నాడు బలాకగుప్త.

"అది నాకు సాధ్యం కాదు," అన్నాడు జటాధరుడు.

"మీ నాయకుడికి జూదం లాటి దాని మీద మోజు ఉన్నదా?" అని బలాకగుప్త మళ్ళీ అడిగాడు.

"జూదం కాదు గాని, మా నాయకుడికి చదరంగం ఆడటం అంటే చాలా ఇష్టం. పందెం కాసి మరీ ఆడతాడు. నేను చాలా సార్లు అతణ్ణి చదరంగంలో ఓడించి డబ్బు గెలుచుకున్నాను," అన్నాడు జటాధరుడు.

"మీ నాయకుణ్ణి మా వద్దకు ఒకసారి పంపగలవా? మాకు చదరంగం బాగా వచ్చునని చెప్పు," అన్నాడు బలాకగుప్త జటాధరుడితో.

జటాధరుడు ఏమి చెప్పాడో గాని, దొంగలనాయకుడు ఖైదీ లున్న గుహకు వచ్చాడు.

"నువు నిజంగానే మమ్మల్ని కాళీ మాతకు బలి ఇవ్వబోతున్నావా?" అని బలాకగుప్త అతన్ని అడిగాడు.

"ఆ మాట వేళాకోళానికి చెప్పాననుకున్నావా?" అన్నాడు దొంగలనాయకుడు రౌద్రంగా.

"కొంచెం ఆలోచించుకో. నేను కూడా కాళీమాత భక్తుణ్ణి. అంతేకాదు, కాళీమాత నుంచి వరం పొందినవాణ్ణి," అన్నాడు బలాకగుప్త.

"నేను నమ్మను," అన్నాడు దొంగల నాయకుడు.

"నువు నమ్మవద్దు. నేను రుజువు చేస్తాను. నా కళ్ళకు గంతలు కట్టు. ఒక సంచీలో నీ యిష్టం వచ్చిన నాణాలు ఆరు



వెయ్యి. అందులో ఒక నాణెం నీ గుప్పిట్లో పట్టుకుని ఒక నిమిషంసేపు కాళీమాతను ధ్యానించి తిరిగి సంచీలో వేసెయ్యి. తరవాత ఆ సంచిని నా కియ్యి. నువు గుప్పిట్లో పట్టుకున్న నాణెం నేను తీస్తాను," అన్నాడు బలాకగుప్త.

దొంగలనాయకుడు ఈ మాట నమ్మలేదు. కాని బలాకగుప్త అలా చెయ్యలేడని రుజువు చెయ్యటానికి అతని కళ్ళకు గంతలు కట్టి, ఒక సంచీలో ఆరునాణాలు పోసి, అందులో నుంచి ఒకటి తీసి తన గుప్పిట పెట్టుకుని కాళీమాతను ధ్యానం చేసి, తిరిగి దాన్ని సంచీలో వేసి, ఆ సంచీని బలాకగుప్త చేతికి ఇచ్చాడు. కళ్ళకు గంతలుండగానే బలాకగుప్త సంచీలోపల తడివి, దొంగలనాయకుడి చేతిలో ఉండిన నాణాన్ని పైకి తీసి, "ఇదేనా?" అని అడిగాడు.

దొంగలనాయకుడు నిర్ఘాంత పోయాడు. అతను బలాకగుప్తుణ్ణి ఇలా మూడుసార్లు పరీక్షించాడు. మూడుసార్లూ బలాకగుప్త సరి అయిన నాణాన్నే పైకి తీశాడు.

దొంగలనాయకుడు బలాకగుప్త కాళ్ళపై పడి, "క్షమించు, స్వామీ! నువు నిజంగా కాళీమాత భక్తుడివే. నీకు కాళీమాత వరం ఉన్నది!" అని క్షమాపణ చెప్పుకుని, అతనికి అతని సొత్తే కాక, అదనంగా కానుకలు కూడా ఇచ్చి పంపేశాడు.

వాళ్ళు తమ దేశానికి తిరిగి వచ్చేటప్పుడు గోపాలుడు, తన యజమానిని, "బాబూ, తమకు కాళీమాత వరం ఉన్న మాట ఎన్నడూ చెప్పారుకారేం?" అని అడిగాడు.

బలాకగుప్త నవ్వి, "పిచ్చివాడా, నేను చేసినది చిన్న ఇంద్రజాలం. ఈ చలిరోజుల్లో ఒక నాణెం ఎవరన్నా ఒక నిమిషంసేపు గుప్పిట పట్టుకుంటే అది వేడెక్కుతుంది. దాన్ని మామూలు నాణాలతో చేర్చినప్పుడు మిగిలినవి చల్లగా వుంటాయి. అది ఒకటే వేడిగా ఉంటుంది," అన్నాడు.

"మొత్తం మీద ఇంద్రజాలం మన ధనప్రాణాలను కాపాడింది," అన్నాడు గోపాలుడు.



# తగిన కారణం

ఒక యజమాని వద్ద వేటకుక్క ఉండేది. అది ఒకనాడు వీధిలో నిలబడి ఉండి, దారిన వెళ్ళే ఒక కాపువాణ్ణి కరవబోయింది. నమ్మయానికి ఆ కాపు చేతిలో ఒక గునపం ఉన్నది. దానితో వాడు కుక్క నెత్తిన పొడిచాడు. ఆ దెబ్బకు కుక్క చావలేదుగాని, దాని నెత్తిన పెద్ద గాయమై, నెత్తురు చాలా కారింది.

కుక్క యజమాని గ్రామాధికారి వద్దకు వెళ్ళి, తన కుక్కను గాయపరిచిన కాపు మీద ఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి కాపును పిలిపించి, "ఈ పెద్దమనిషి కుక్కను ఎందుకు గాయపరిచావు?" అని అడిగాడు.

ఆ కుక్క అకారణంగా తనను కరవ వచ్చిందని కాపు చెప్పాడు.

కుక్క యజమాని కలగజేసుకుని కాపుతో, "కొట్టేవాడివి గునపాన్ని తలకిందులుగా తిప్పికొట్టక మొనతో ఎందుకు కొట్టావు?" అన్నాడు.

"మీ కుక్క నన్ను తోకతో కాకుండా నోటితో ఎందుకు కరవరావాలి?" అని అడిగాడు కాపు.

న్యాయాధికారితో బాటు అక్కడ ఉన్నవాళ్ళంతా విరగబడి నవ్వారు.

—ఎం. సువర్ణలత





# అసలు-నకలు

ఒక గ్రామంలో నీలకంఠుడూ, ముకుందుడూ అని ఇద్దరు గృహస్థులు ఇరుగు పొరుగున ఉండేవారు. ముకుందుడు తన మానాన తాను జీవించేవాడు. కాని నీలకంఠుడు కొంచెం ఈర్ష్యాపరుడు.

ఇద్దరికీ పెళ్ళియీడు వచ్చిన కూతుళ్ళు ఉన్నారు. ముందుగా ముకుందుడి కుమార్తెకు సంబంధం కుదిరింది. అవతలివాళ్ళు కట్నాలను గురించి ఏమీ తగాదా పెట్టక, ముకుందుడు ఏమిస్తే అది తీసుకోవటానికి ఒప్పుకున్నారు.

ఇది జరిగాక నీలకంఠుడి కూతురికి కూడా సంబంధం కుదిరింది. అయితే మగ పెళ్ళివారు, పెళ్ళికూతురికి రవ్వలకమ్మలు చేయించి పెట్టి మరీ కన్యాదానం చేయాలని పట్టుబట్టారు.

సంబంధం వదులుకోవటం ఇష్టం లేక నీలకంఠుడు సరే నన్నాడు. కాని అసలు రవ్వలకమ్మలు కొనే శక్తి అతనికి లేదు. అందుచేత అతను బస్తీకిపోయి నకిలీ రవ్వల కమ్మలు కొని తెచ్చి, ఆ సంగతి రహస్యంగా ఉంచవలసిందని తన భార్యకు చెప్పాడు.

తన కన్న ముకుందుడు తేలికలో పోవటం నీలకంఠుణ్ణి బాధించింది. అతను పని పెట్టుకుని ముకుందుడి కూతుర్ని చేసుకోబోయేవారి ఊరు వెళ్ళి, వారితో, "నేను ముకుందుడి పొరుగువాణ్ణే. మా ఇద్దరి కుమార్తెలకూ ఒకేసారి పెళ్ళిళ్ళు చేస్తున్నాము. నేను నా కుమార్తెకు రవ్వల కమ్మలు పెట్టి పెళ్ళి చెయ్యబోతున్నాను. మీరు కోరి ఉంటే ముకుందుడు కూడా తన కుమార్తెకు రవ్వలకమ్మలు పెట్టి పెళ్ళి చెయ్యగలవాడే," అన్నాడు.

ఆ మాట నమ్మి ముకుందుడి కుమార్తెను చేసుకోబోతున్న వాళ్ళు, నిశ్చితార్థం

బి. ధర్మారావు

నాటికి పిల్లకు రవ్వలకమ్మలు కొనమని ముకుందుడికి తమ మనిషి ద్వారా కబురు చేశారు.

ఈ మాట వినగానే ముకుందుడి గుండెలో రాయి పడింది. అసలురవ్వల కమ్మలు కొనే శక్తి అతనికి లేదు. అందుచేత అతను కూడా బస్తీకిపోయి నకిలీరవ్వల కమ్మలు కొన్నాడు.

ఇది జరిగేలోపుగా నీలకంఠుడి భార్య, తన కుమార్తె పెళ్ళి నిశ్చయమైనట్టు తన అన్నకు రాస్తూ, తన భర్త నకిలీరవ్వల కమ్మలు కొన్నాడనీ, ఆ సంగతి బయట పడితే తన కూతురు కాపరం చెడుతుందనీ తెలిపింది. నీలకంఠుడి బావమరిది అసలు రవ్వల కమ్మలే పంపాడు. అయితే ఈ సంగతి తన భర్తకు చెప్పక, నీలకంఠుడి భార్య నకిలీరవ్వలకమ్మలను రహస్యంగా దాచింది. ఎందుకంటే నీలకంఠుడికీ, అతని బావ మరిదికీ ఏదో కారణంవల్ల చాలా కాలంగా మాటలు లేవు.

తన ప్రయత్నం ఫలితంగా ముకుందుడు కూడా రవ్వలకమ్మలు కొన్నాడని వినగానే, అవి అసలురవ్వల కమ్మలు అయి ఉంటా యనీ, వాటిని ఎలాగైనా కాజెయ్యాలనీ నీలకంఠుడికి దుర్బుద్ధి పుట్టింది. అతను తన ఇంట వున్న కమ్మలు రహస్యంగా పట్టుకుని ముకుందుడి ఇంటికి వెళ్ళి, "నువు రవ్వలకమ్మలు కొన్నావుట, ఏవీ? చూపించు. నేనుకూడా అలాటివే కొంటాను," అన్నాడు.



ముకుందుడు తాను కొన్న నకిలీరవ్వల కమ్మలు తెచ్చి చూపాడు. వాటిని చూస్తూ నీలకంఠుడు దగ్గుతెర తెచ్చుకుని, తాగటా నికి నీరు కావాలని సైగ చేశాడు. ముకుం దుడు లోపలికి వెళ్ళి నీరు తెచ్చేలోపల నీలకంఠుడు తన కమ్మలు, ముకుందుడి కమ్మలకు మార్చేసి, నీరు తాగి తన ఇంటికి వచ్చేశాడు. తాను తెచ్చుకున్నవి నకిలీ రవ్వల కమ్మలనీ, తాను ఉంచినవి అసలు రవ్వల కమ్మలనీ అతను ఎరగడు.

నిశ్చితార్థానికి వస్తూ నీలకంఠుడి వియ్యాల వారు కమసాలిని వెంట తెచ్చి, పెళ్ళి కూతురికి కొన్న రవ్వల కమ్మలను పరీక్ష చేయించారు. కమసాలి వాటిని చూసి అవి నకిలీ రవ్వలన్నాడు.

నీలకంఠుడు కంగారుపడి, "ముకుం దుడు కొన్న రవ్వలకమ్మల లాటివే నేనూ కొన్నాను. కావలిస్తే వాటిని పరీక్షించండి," అన్నాడు. ముకుందుడి వద్ద ఉన్న రవ్వల కమ్మలు చూసి కమసాలి, అవి అసలు రవ్వలని చెప్పాడు.

నీలకంఠుడి వియ్యాల వారికి చాలా కోపం వచ్చింది. వాళ్ళు సంబంధం మాను కునే ధోరణిలో ఉండగా ముకుందుడు వారితో, "మీరు తొందర పడకండి. నేను కొన్నవి నకిలీరవ్వల కమ్మలే. ఏదో పొర పాటు జరిగి కమ్మలు మారి ఉంటాయి. నీలకంఠుడివే అసలురవ్వల కమ్మలు," అన్నాడు.

పెళ్ళివారు తృప్తిపడి నిశ్చితార్థం చేసు కున్నారు.

ముకుందుడి వియ్యాల వారు కూడా ముకుందుడితో పేచీ పడలేదు. "మీరు రవ్వలకమ్మలు కొనమన్నారు. అసలురవ్వ లవి కొనే శక్తిలేక నకిలీరవ్వలవి కొన్నాను," అని ముకుందుడు చెబితే వాళ్ళు తృప్తి పడ్డారు.

ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళూ సలక్షణంగా జరిగిపోయాయి.

అటు తరవాత నీలకంఠుడు ముకుం దుణ్ణి చూసి ఈర్ష్యపడలేదు. ఇద్దరూ స్నేహితుల్లా జీవించారు.






# న్యాయపాలన

పూర్వం ఒక సుల్తాను తన ప్రజలను ఎంతో న్యాయంగా పాలించేవాడు. తన దేశంలో ఎంత హీనులకు ఎలాటి అన్యాయం జరిగినా వారికి న్యాయం చేకూర్చనిదే నిద్ర పోయేవాడు కాడు.

ఒకసారి సుల్తాను దర్బారులోకి ఒక మనిషి, చేతిలో సంచీ ఒకటి పట్టుకుని వచ్చి, ఒక పక్కగా నిలబడ్డాడు. సుల్తాను ఆ మనిషిని చూసి, "నీ కేదో కష్టం కలిగి నట్టున్నది. ఏమన్నా చెప్పుకోదలిచావా?" అని అడిగాడు.

"ప్రభూ, నే నొక వ్యాపారిని. మీ పరిపాలనలో నాకు తీరని మోసం జరిగింది," అన్నాడు ఆ మనిషి.

"ఏం జరిగిందో చెప్పు. నీకు జరిగిన అన్యాయాన్ని నేను సరిచేస్తాను," అన్నాడు సుల్తాను. వ్యాపారి తనకు జరిగిన మోసం గురించి సుల్తానుకు తెలిపాడు.

ఆ వ్యాపారి ప్రయాణం మీద పోతూ, తన కష్టార్జితమైన రెండువేల అష్రఫీలు ఆ సంచిలో పెట్టి ఆ నగరంలోని కాజీగారి వద్ద ఉంచాడు. దారిలో దొంగలు దోస్తారని వ్యాపారి భయపడి అలా చేశాడు. కాని అతను తిరిగి వచ్చిచూస్తే కాజీగారే సంచీలో అష్రఫీలకు బదులు రాగిముక్కలు పెట్టాడు.

"సంచీ తిరిగి పుచ్చుకునేటప్పుడు దాన్ని సరిగా చూసుకోలేదా?" అని సుల్తాను వ్యాపారిని అడిగాడు.

"ప్రభూ, ఆ సంచీ నే నిచ్చినదే. నేను ఇంటికి వచ్చి, ముద్ర ఊడదీసి చూసేదాకా అందులో డబ్బు పోయిందనీ, దానికి మారుగా రాగిముక్కలు వచ్చాయనీ తెలియలేదు," అన్నాడు వ్యాపారి.

"సంచీలో కంతలు గాని, చిరుగులు గాని ఉన్నాయేమో ముందుగా చూసుకున్నావా?" అని సుల్తాను మళ్ళీ అడిగాడు.

హెచ్. పద్మనాభం

"అలాటి వేమీ లేవు. వేసిన ముద్ర వేసినట్టే ఉన్నది కూడా! అందులో డబ్బు లేదనుకోవటానికి ఎలాటి కారణమూ లేక పోయింది," అన్నాడు వ్యాపారి.

సుల్తాను కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి, వ్యాపారితో, "సరే, ఈ సంచీ ఇక్కడే ఉంచి నువు ఇప్పుడు వెళ్ళిపో. నువు చెప్పినది నిజమైతే నీకు తప్పక న్యాయం జరుగుతుంది. కాని, నువు అబద్ధం చెప్పి ఉంటే నీ ప్రాణాలు దక్కవు," అన్నాడు.

దర్బారు ముగిసింది. సుల్తాను ఇంటికి వెళ్ళి కూడా వ్యాపారి చేసిన ఫిర్యాదు గురించే ఆలోచిస్తున్నాడు. ముద్ర ముద్రగానే ఉండగా సంచీలోని బంగారం ఎలా పోయింది?

ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకునే మార్గం సుల్తానుకు అకస్మాత్తుగా తట్టింది. వెంటనే ఆయన దర్బారు భవనానికి తిరిగి వెళ్ళి, తన సింహాసనం పై పరచి ఉన్న అమూల్యమైన రత్నకంబళాన్ని వేళ్ళతో అక్కడక్కడా చించి, తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.

మర్నాడు ఉదయం సుల్తాను తన గుర్రం మీద వేటకు వెళ్ళిన సమయంలో, దర్బారు భవనం ఊడ్చే నౌకరు వచ్చి, సింహాసనం మీద ఉండే రత్నకంబళం అక్కడక్కడా చిరిగి ఉండటం చూసి కంగారుపడ్డాడు. వాడు వెళ్ళి రాజభవనంలో ఉండే సర్దారును పిలుచుకువచ్చి రత్నకంబళాన్ని చూపించాడు.



సర్దారు నౌకరుతో, "భయపడకు. దీన్ని సరి చెయ్యవచ్చు. నగరంలో మహమ్మద్ అనే తెలివైన దర్జీ ఉన్నాడు. వాణ్ణి పిలుచుకురా. వాడు చిరుగు ఎక్కడ అయినదీ తెలియరాకుండా రత్నకంబళాన్ని మరమ్మతు చెయ్యగలడు. వెంటనే పోయిరా," అన్నాడు.

నౌకరు మహమ్మద్ ఇంటికి వెళ్ళి విషయం చెప్పి, "సింహాసనం మీది రత్నకంబళం చిరిగినట్టు సుల్తానుగారికి తెలిస్తే నా పీక తెగిపోతుంది," అన్నాడు.

"నీ ప్రాణానికేమీ భయం లేదు. రెండు అష్రఫీలు ఇచ్చుకున్నావంటే ఆ రత్నకంబళాన్ని కుట్టు తెలియకుండా మరమ్మతు చేసేస్తాను," అన్నాడు దర్జీవాడు.

నౌకరు డబ్బు తీసి దర్జీవాడి చేతిలో పెట్టి, వాణ్ణి వెంట బెట్టుకుని దర్బారు భవనానికి వచ్చాడు. మహమ్మద్ తెలివి తేటలు ఎలాటివో గాని, వాడి మరమ్మతు పూర్తి అయేసరికి రత్నకంబళం మునుపు ఉండి నట్టుగానే తయారయింది. దర్బారు భవనం ఊడ్చే నౌకరు ప్రాణాలు కుదట పడ్డాయి.

సూర్యాస్తమయం వేళకు సుల్తాను సపరివారంగా వేట నుంచి తిరిగి వచ్చి, గుర్రం మీది నుంచి దిగుతూనే తిన్నగా దర్బారు భవనానికి వెళ్ళాడు. ఆయన తన సింహాసనం మీది రత్నకంబళం మామూలుగా ఉండటం గమనించాడు. ఆయన ఊహించి నట్టే దాని మీద చిరుగుల జాడ ఏ మాత్రమూ



లేదు. కసువు ఊడ్చే నౌకరును పిలిపించి అయన, "ఈ రత్నకంబళం చిరిగి ఉండాలే?" అన్నాడు.

నౌకరు కంగారు పడుతూ, "లేదు, ప్రభూ. సరిగానే ఉన్నది," అన్నాడు.

"అబద్ధమాడతావా, దొంగ వెధవా? నేనే ఆ కంబళాన్ని స్వయంగా చించాను. నిజం చెప్పు, దీన్ని మరమ్మతు చేసినది ఎవరు?" అన్నాడు సుల్తాను మండిపడుతూ.

నౌకరు వణికిపోతూ మహమ్మదు చేసిన మరమ్మతు గురించి బయటపెట్టాడు.

సుల్తాను మహమ్మద్‌ను రప్పించి, వాడికి వ్యాపారి తాలూకు సంచీని చూపి, "ఈ సంచీని ఎప్పుడన్నా చూశావా?" అని అడిగాడు.

మహమ్మద్ సంచీని అటూ ఇటూ తిప్పి చూసి, "చూశాను, ప్రభూ! మన నగరంలో ఉండే కాజీగారు నా చేత దీన్ని మరమ్మతు చేయించారు," అన్నాడు.

సుల్తాను దర్జీవాణ్ణి పంపేసి, కాజీని పిలిపించి, "ఇలాంటి అవమానకరమైన పనులు చెయ్యటానికి నీకు సిగ్గులేదా? నువు అవమానంపాలు కావటమే గాక, నా కీర్తినీ, దేశప్రతిష్ఠనూ కూడా మంటగలిపావే!" అన్నాడు.

"ప్రభూ, నే నెన్నడూ అలాటి పనులు చెయ్యను. గిట్టని వాళ్ళు ఎవరో నన్ను గురించి తమకు అబద్ధాలు చెప్పి ఉంటారు," అన్నాడు కాజీ.

"నోరుముయ్యి, నీచుడా! ఇదేమిటి?" అంటూ సుల్తాను తన చేతిలో ఉన్న సంచీని కాజీ ముఖాన విసిరికొట్టాడు.

కాజీకి తాను వ్యాపారికి చేసిన ద్రోహం గుర్తుకు వచ్చి, సుల్తానుకు క్షమాపణ చెప్పుకోబోయాడు.

కాని సుల్తాను ఆ క్షమాపణలను స్వీకరించక కాజీని ఖైదు చేయించాడు. అయన మర్నాడు వ్యాపారిని పిలిపించి, అతనికి రావలసిన రెండువేల అష్రఫీలకు మరి మూడువేలు చేర్చి ఇస్తూ, "పెద్ద హోదాలో ఉన్న ఒక మోసకారిని పట్టి ఇచ్చినందుకు నీకు ఈనాం ఇస్తున్నాను," అన్నాడు.



# రాజధర్మం

ఒకప్పుడు పర్షియాను పాలించిన నౌషేర్వాన్ గొప్ప ధర్మప్రభువుగా కీర్తి గడించాడు. రాజనీతిలోనూ, రాజ్యతంత్రాలలోనూ ఆయన ఆదర్శప్రాయుడుగా పరిగణించబడేవాడు.

ఒకసారి ఆయన సపరివారంగా అరణ్యంలో వేటకు వెళ్ళాడు. అక్కడ ఆయన మజిలీలో వంట తయారుచేస్తున్నారు. ఏ కారణంచేతనో వంటవాళ్ళు ఉప్పు తీసుకురావటం మరిచిపోయారు. అందుచేత మంత్రి ఒక భటుణ్ణి పిలిచి, సమీపంలో ఉన్న గ్రామానికి వెళ్ళి ఉప్పు తెమ్మని ఆజ్ఞాపించాడు.

అది విని నౌషేర్వాన్, "మనకు కావలిసిన ఉప్పు అంతా వెల ఇచ్చి తీసుకురా," అన్నాడు భటుడితో.

"ఈ భాగ్యానికి సొమ్ము ఇవ్వాలా?" అని అడిగాడు మంత్రి.

"ప్రపంచంలో నిరంకుశత్వమూ, దౌర్జన్యమూ ఇలాటి స్వల్ప విషయాలతోనే ఆరంభమవుతాయి. మన తరవాత వచ్చేవారు మరింత ప్రజాపీడన చేస్తారు. అది అంతులేకుండా పెరిగిపోతుంది," అన్నాడు నౌషేర్వాన్.

—ఎ. శివరామలక్ష్మిప్రసాద్





# లోభికిగుణపాఠం

ఒక ఊళ్ళో శ్రీపతీ, జగపతీ అని ఇద్దరు యువకులుండేవారు. శ్రీపతి సంపన్నుడు. జగపతి పేదవాడు. అయినా ఇద్దరికీ మంచి స్నేహం ఉండేది.

ఒకనాడు వారిద్దరూ కలిసి గ్రామాంతరం వెళుతుంటే ఒక ఊరి బావి వద్ద ఇద్దరు ఆడపిల్లలు చేదలతో నీరు తోడుకుంటూ కనిపించారు.

శ్రీపతి తన మిత్రుణ్ణి ఒక చెట్టు నీడన ఉండమని, తాను దాహం తీర్చుకునేటందుకు బావి కేసి నడిచాడు. అంతలో అతనికి ఆ ఆడపిల్లలు మాట్లాడుకునే మాటలు వినిపించాయి; శ్రీపతి అంతదూరంలో ఆగి వినసాగాడు.

రంగు చీర కట్టుకున్న పిల్ల తెల్ల చీర కట్టుకున్న పిల్లతో, "లక్ష్మి, నిజం చెప్పు. నువు ఎలాటి మొగుడు రావాలనుకుంటున్నావు?" అన్నది.

"అనుకోవటానికేం రోహిణీ? నాకు పెద్ద కోరికలే ఉన్నాయి. బోలెడు నగలూ, చీరలూ కావాలి. పెద్ద మేడ ఉండాలి. పనివాళ్ళుండాలి. భోజనంలోకి చాలా కూరలూ, పిండివంటలూ కావాలి. మనం కావాలనుకున్నవన్నీ దొరుకుతాయా?" అన్నది లక్ష్మి.

రోహిణి నిట్టూర్పు విడిచి, "నా కలాటి కోరిక లేవీ లేవు, తల్లీ! ఉన్నదానితో తృప్తిపడటం ముఖ్యం. నగలూ, చీరెలూ ప్రాప్తాన్నిబట్టి వస్తాయి. తిండి కేమిటి? ఇంత గోంగూర పచ్చడి చాలు. జిహ్వచాపల్యం ఇన్ని బటానీలు తిన్నా తీరుతుంది," అన్నది.

ఈ మాటలు విన్న శ్రీపతికి ఒక ఆలోచన వచ్చింది. ఆ ఇద్దరు పిల్లలూ పెళ్ళి కావలిసిన వాళ్ళే. రోహిణి వంటి భార్య తనకు వస్తే దుబారా ఖర్చు ఉండదు.

లక్ష్మి వంటి భార్య వస్తే పేదవాడైన జగపతి ఎలా తట్టుకుంటాడో చూడాలన్న దుర్బుద్ధి కూడా శ్రీపతికి కలిగింది.

అందుచేత అతను జగపతి దగ్గిరికి తిరిగి వచ్చి, "బావి దగ్గిర పిల్లలిద్దరికీ పెళ్ళి కాలేదులా గుంది. మనం కూడా పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాం కద. రంగు చీర కట్టుకున్న పిల్లను నేను చేసుకుంటాను. తెల్ల చీర కట్టుకున్న పిల్లను నువు చేసుకో. సరేనా ?" అన్నాడు.

జగపతి సరేనన్నాడు. స్నేహితులిద్దరూ ఆ పిల్లల వెనకగా ఊళ్ళోకి వెళ్ళి, పెళ్ళి ప్రయత్నాలు చేశారు. ప్రయత్నాలు ఫలించాయి. పెద్ద కోరికలు గల లక్ష్మి జగపతిని పెళ్ళాడి, అతని పూరి కొంపలో అడుగు పెట్టింది. ఏ పెద్ద కోరికా లేని రోహిణి శ్రీపతిని పెళ్ళాడి, అతడి పెద్ద మేడలో అడుగు పెట్టింది.

రోహిణి శ్రీపతి ఇంట అడుగు పెడుతూనే ఇల్లంతా కలయజూసి, "ఇంత ఇంట్లో ఒక్క నౌకరూ కనిపించడేమిటి?" అన్నది.

శ్రీపతి తేలికగా నవ్వేసి, "నౌకరెందుకు? జీతం దండగ. మన పనులు మనమే చూసుకుంటే పోలేదా? అదివరకు ఒక నౌకరు ఉండేవాడు; మాన్పించేశాను. నువ్వున్నావుగా? ఇద్దరమూ చెరొక పనీ చూసుకుందాం," అన్నాడు.

రోహిణి వంటకు ఉపక్రమిస్తూ, "ఏం కూరలు వండమన్నారు? పిండివంటలు ఏం చెయ్యను?" అని భర్తను అడిగింది.



"కూరలంటావేమిటి? అన్నంలోకి కాస్త గోంగూర పచ్చడి చాలదూ? పిండి వంటలు దేనికి? కాసిని బటానీలు పట్టుకు వస్తా. వాటితో నోటి ఉబలాటం తీరు తుంది!" అన్నాడు శ్రీపతి.

ఆ రాత్రి రోహిణి తన భర్తతో, "మనకు ఇంత సిరీ, సంపదా ఉన్నది గదా. నాకు మంచి మంచి చీరలూ, నగలూ తెచ్చి పెట్టండి," అన్నది.

దానికి శ్రీపతి, "ఇదుగో, నువు ఇలా అడగకూడదు. సిరి ఉన్న మాత్రాన దండుగ ఖర్చులు చేయకూడదు. చీరలూ, నగలూ దేనికి? తృప్తి ఉండాలి," అన్నాడు.

"వట్టి లోభి!" అని రోహిణి తన భర్తను తిట్టుకున్నది.

మర్నాడు శ్రీపతి నిద్ర లేచేసరికి ఇంట్లో నలుగురు మనుషులు పనుల మీద తిరుగుతూ కనిపించారు.

"ఎవరు మీరు? ఇక్కడ ఏం చేస్తున్నారు?" అని అతను వాళ్ళను అడిగాడు.

"పనిమనుషులం, బాబయ్యా! అమ్మగారు ఇవాళ నుంచీ మమ్మల్ని పనిలోకి రమ్మన్నారు," అన్నారు వాళ్ళు దణ్ణాలు పెట్టి వినయంగా.

"ఏమిటీ? ఏకంగా నలుగురే? పొండి. మిమ్మల్ని నే నెక్కడ భరిస్తాను?" అని శ్రీపతి అరిచాడు.

అంతలో రోహిణి వచ్చి భర్తతో శాంతంగా, "మీరు ఊరుకోండి. ఈ నలుగురి నేమిటి, నలభైమంది నౌకర్లను భరించే శక్తి ఉన్నది



మనకు," అని నౌకర్లతో, "ఇక్కడెందుకు? వెళ్ళి మీ పనులు మీరు చూసుకోండి," అని పంపేసింది.

శ్రీపతి భోజనానికి కూర్చోగానే వంట వాడు వచ్చి, నాలుగు కూరలూ, పిండి వంటలూ వడ్డించాడు.

"నా కొంప గుల్ల అవుతున్నది!" అని శ్రీపతి అరిచాడు.

"ఇస్, ఊరుకోండి. పనివాళ్ళు నవ్వి పోతారు. మనం ఇంత తిని ఇతరులకు ఇంత పెట్టగలం. ఎందుకు బాధపడతారు?" అన్నది రోహిణి.

మరో నాలుగు రోజులు గడిచాక రోహిణి రకరకాల బట్టలూ, నగలూ కొని తెచ్చి తన భర్తకు చూపింది. వాటిని చూసి శ్రీపతి, "బాబోయ్, నేను బికారినయిపోయాను," అంటూ బావురుమని ఏడిచాడు.

రోహిణి అతని కళ్ళు తుడుస్తూ "ఏడవ కండి. ఊరుకోండి," అని ఓదార్చింది.

"ఏడవక ఏం చెయ్యమన్నావు? ఆ నాడు బావి దగ్గిర నీ మాటలు విని మోసపోయాను. వట్టి అబద్ధాలకోరువి," అన్నాడు శ్రీపతి.

రోహిణి ఆశ్చర్యపడుతూ, "అదా సంగతి! ఆ రోజు నా మాటలు విని నన్ను చేసుకున్నారన్నమాట! అయినా నేను అబద్ధాలకోరును కాను. మనకు గతి లేక పోతే సరిపెట్టుకునేదాన్నే. ఇప్పుడు అలా కాదుగదా! కావలిసినంత ఉన్నది," అన్నది.

తన సంగతే ఇలాగుంటే లక్ష్మని పెళ్ళా డిన జగపతి ఎలా బాధపడుతున్నాడో అను



కున్నాడు శ్రీపతి. అతను జగపతి ఇంటికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి జగపతీ, లక్ష్మీ భోజనం చేస్తున్నారు. శ్రీపతిని చూసి జగపతి, "రా! రా!" అంటూ ఆహ్వానించాడు.

శ్రీపతి ఆ దంపతుల కెదురుగా చతికిలబడి, "అంతులేని గొంతెమ్మ కోరికలు గల లక్ష్మితో ఈ జగపతి ఎలా వేగుతున్నాడో?" అని తనలో అనుకున్నాడు. కాని జగపతి మొహం చూస్తే, అతను భార్యతో యాతన పడుతున్న లక్షణా లేమీ కనిపించలేదు. అతను మంచి ఉత్సాహంలో ఉన్నట్టు కనిపిస్తున్నాడు. వాళ్ళు ఉత్త గోంగూర పచ్చడి మెతుకులే తింటున్నారు. లక్ష్మి మొహంలో అసంతృప్తి లేదు. కావటానికి పూరి ఇల్లే అయినా చాలా శుభ్రంగా ఉన్నది.

జగపతి భోజనం ముగించి వచ్చి శ్రీపతి పక్కన కూర్చుంటూ, "నిన్ను కలుసుకుందామంటే తీరటమే లేదు. ఎలా ఉన్నది నీ కొత్త సంసారం?" అన్నాడు.

"నా సంసారానికేంలే? నీ కంత తీరక పోవటానికేమిటి కారణం?" అని శ్రీపతి అడిగాడు.

"అటు చూడు, పెరడంతా చదును చేసి, శుభ్రం చేసి, మొక్కలు నాటాం. అవి కాపుకు వచ్చాయంటే మాకు బోలెడు ఆదాయం," అన్నాడు జగపతి.

"నీ భార్య కూడా నీతో పాటు శ్రమ పడుతున్నదా? నగలూ, చీరలూ కావాలని వేధించటం లేదా?" అని అడిగాడు శ్రీపతి.

"అదేమీ లేదే!" అన్నాడు జగపతి.

"అయితే ఆనాడు బావి దగ్గర జరిగిన సంభాషణ తారుమా రయిందన్నమాట!" అన్నాడు శ్రీపతి.

"తారుమారు ఏమీ లేదు, అన్నగారూ. ఆ నాడు నా కా కోరికలన్నీ ఉన్న మాట నిజమే. కాని ఇపుడు ఉన్నదానితో తృప్తి పడటం నేర్చుకున్నాను," అన్నది లక్ష్మి.

శ్రీపతి గుణపాఠం నేర్చుకున్నాడు: సంపద కోరికలను వృద్ధి చేస్తుంది, పేదరికం వాటిని అదుపులో ఉంచుతుంది.






ఇంద్రుడి వద్ద అర్జునుడు ఉండే సమయంలో రోమశు డనే మహర్షి మూడులోకాలూ తిరుగుతూ స్వర్గానికి వెళ్ళి, ఇంద్రసింహాసనంమీద ఇంద్రుడితోబాటు కూర్చుని ఉన్న అర్జునుణ్ణి చూసి అంతులేని ఆశ్చర్యంతో, "ఇతను ఎంత తపస్సు చేస్తే ఇంద్రుడి సింహాసనం మీద కూర్చునే అర్హత లభించి ఉండాలి?" అనుకున్నాడు.

ఆయన ఆశ్చర్యాన్ని గమనించి ఇంద్రుడు చిరునవ్వు నవ్వి, "మునీశ్వరా, ఈ అర్జునుడు సాధారణ మానవుడు కాడు; పూర్వజన్మలో నరు డనే మహర్షి. నారాయణు డనే మహర్షితో కలిసి ఇతను అనేకవేల ఏళ్ళు బదరికావనంలో తపస్సు చేశాడు. నారాయణ ఋషి పూర్వజన్మలో కపిలమహాముని. నరనారాయణులు ఇద్దరూ భూభారం తగ్గించటానికి ఇప్పుడు అర్జునుడు గానూ, కృష్ణుడు గానూ పుట్టి ఉన్నారు. పాతాళంలో ఉన్న నివాతకవచులు దేవతలను చాలా పీడిస్తున్నారు. వారిని ఈ అర్జునుడు నిర్మూలించాలి. అందుకే ఇతన్ని ఇక్కడికి రప్పించాను. నువు భూలోకానికి వెళ్ళి, కామ్యకవనంలో ఉన్న ధర్మరాజుతో, అర్జునుడు స్వర్గంలో నృత్య సంగీతాలు నేర్చుకుంటూ సుఖంగా ఉన్నాడని చెప్పు." అన్నాడు.

రోమశమహాముని ఇంద్రుడు చెప్పిన ప్రకారం భూలోకానికి బయలుదేరాడు.

అర్జుడు స్వర్గానికి వెళ్ళాడనీ, దివ్యాస్త్రాలు సంపాదించుకున్నాడనీ ధృతరాష్ట్రుడికి

## 30. పాండవుల తీర్థయాత్రలు



వ్యాసుడు తెలిపాడు. వెంటనే ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పిలిచి, "విన్నావా, సంజయా? అర్జునుడు స్వర్గానికి వెళ్ళి దివ్యాస్త్రాలు సంపాదించాడట! దుర్యోధనుడి దుర్బుద్ధి వల్ల ఎటువంటి ప్రమాదం ఏర్పడిందో చూడు! పాపం, ప్రజలు ఎలాంటి ఆపదలు పొందుతారో! ధర్మరాజూ, అర్జునుడూ కలిసి మూడు లోకాలూ జయించగలరు. నా కొడుకులకు చావుమూడింది," అని దిగులుపడ్డాడు.

"అందులో అబద్ధం ఏమీలేదు. ద్రౌపదిని సభకు ఈడ్చి తెచ్చి, అన్నివిధాల అవమానిస్తే, మీ కొడుకుల మీద పాండవులకు పగ ఉండక ఏం చేస్తుంది?" అన్నాడు సంజయుడు.

అర్జునుడు తిరిగి వచ్చేదాకా తీర్థయాత్రలు చెయ్యమని ధౌమ్యుడు ధర్మరాజుకు చెప్పాడు. ధర్మరాజు తన తమ్ములనూ, ద్రౌపదినీ బ్రాహ్మణ బృందాన్నీ వెంట బెట్టుకుని తిరుగుతూ తీర్థయాత్రలు చేయటానికి పోదామనుకుంటూండగా వారి వద్దకు రోమశుడు వచ్చి, "ఇంద్రుడి సభ అయిన సుధర్మకు వెళ్ళాను. సింహాసనం మీద మీ అర్జునుడు ఇంద్రుడితోబాటు కూర్చుని ఉన్నాడు. నా కెంతో ఆశ్చర్యం కలిగింది. అర్జునుడు సుఖంగా ఉన్నాడని మీతో ఇంద్రుడు చెప్పమన్నాడు. అందుకే వచ్చాను. అర్జునుడికి ఇంద్రుడు ఎన్నో దివ్యాస్త్రాలు ఇచ్చాడు. ప్రస్తుతం అతను చిత్రసేనుడనే గంధర్వుడి వద్ద నృత్యమూ సంగీతమూ నేర్చుకుంటున్నాడు. ఇంద్రుడు నిన్ను తీర్థయాత్రలు చెయ్యమన్నాడు. నేను ఇదివరకు రెండుసార్లు తీర్థయాత్రలు చేశాను. మళ్ళీ మూడోమారు మీ వెంట వస్తాను," అన్నాడు.

ధర్మరాజుకు చాలా ఆనందమయింది. అర్జునుడు వెళ్ళిన పని సానుకూలమయింది. తాను చేయదలచిన తీర్థయాత్రలనే చేయమని ఇంద్రుడు కబురుపంపాడు. ధర్మరాజు తీర్థయాత్రలకు బయలుదేరే ముందు తన వెంట ఉన్న బలగంలో కొంతమందిని హస్తినాపురానికీ, మరికొంతమందిని

ద్రుపదుడి నగరానికీ పంపి, ఆయుధాలూ కవచాలూ గల ఇంద్రసేనుడు మొదలైన వారిని కొద్ది మందిని మాత్రమే దగ్గిర ఉంచుకున్నాడు.

పాండవులు తీర్థయాత్రలు చేసుకుంటూ గోమతీతీర్థమూ, కన్యాతీర్థాలూ, గోతీర్థమూ, బాహుదానదీ తీరమూ, త్రివేణీ, గయా క్షేత్రమూ సేవించారు; అగస్త్యుడి ఆశ్రమానికి వెళ్ళి అక్కడ అగస్త్యుడి కథ విన్నారు.

పూర్వం మణిమంతం అనే పట్టణంలో ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వాళ్ళు బ్రాహ్మణులకు ఆతిథ్యం ఇచ్చి చంపేస్తూ ఉండేవాళ్ళు. వాతాపి మేకగా మారేవాడు. ఇల్వలుడు ఆ మేకను వండి బ్రాహ్మణ అతిథికి పెట్టి, "వాతాపీ, రా!" అని పిలిచేవాడు. వాతాపి ఆ బ్రాహ్మణుడి పొట్టచీల్చుకుని బయటికి వచ్చేవాడు. బ్రాహ్మణ అతిథి చచ్చేవాడు.

ఇలా ఉండగా అగస్త్యమహాముని విదర్భరాజు కూతురైన లోపాముద్రను పెళ్ళాడి, ఆమె కోరగా ధనం తీసుకురావటానికి బయలుదేరాడు. అగస్త్యుడు ముగ్గురు రాజుల వద్దకు వెళ్ళాడు కాని ఏ ఒక్కడికీ ఖర్చుకు మించిన ఆదాయం లేదు. కాని, మణిమంతంలో ఉండే వాతాపీ, ఇల్వలుడూ అనే వాళ్ళవద్ద చాలా




ధనం ఉంటుందని విని, అగస్త్యుడు అక్కడికి వెళ్ళాడు.

ఇల్వలుడు తన అలవాటు ప్రకారం వాతాపిని మేకగా మార్చి, వాడి మాంసం అగస్త్యుడికి పెట్టాడు. అగస్త్యుడామాంసం తిని త్రేన్చాడు. ఇల్వలుడు, "వాతాపీ,రా!" అని పిలిచాడు.

"ఇంకెక్కడి వాతాపి? వాడు అప్పుడే జీర్ణమైపోయాడు," అన్నాడు అగస్త్యుడు.

ఇల్వలుడు తెల్లముఖం వేసి, అగస్త్యుడికీ, ఆయన వెంట వచ్చిన ముగ్గురు రాజులకూ అంతులేని ధనం ఇచ్చి పంపేశాడు.

అగస్త్యుణ్ణి గురించి ధర్మరాజు ఇంకా ఎన్నో కథలు విన్నాడు.



ఒకసారి వింధ్యపర్వతం సూర్యుడితో, "నువు మేరువు చుట్టూ ఎందుకు తిరుగుతావు? అంతకన్న గొప్పవాడినైన నాచుట్టూ తిరుగు," అన్నది.

"నేను మేరువు చుట్టూ బుద్ధిపూర్వకంగా తిరగటంలేదు, నాకు విధించబడిన మార్గంలో తిరుగుతున్నాను," అన్నాడు సూర్యుడు.

వింధ్యుడికి కోపం వచ్చి, సూర్యచంద్రుల దారికీ, గ్రహాల దారికీ అడ్డంగా పెరిగాడు. లోకం అంధకారమయమై పోయింది. అప్పుడు దేవతలు అగస్త్యుడి వద్దకు వెళ్ళి, "మునీశ్వరా, నీ శిష్యుడైన వింధ్యుడు లోకాన్ని తారుమారు చేసేశాడు. అతణ్ణి అదుపులో పెట్టు," అని వేడుకున్నారు.

అప్పుడు అగస్త్యుడు లోపాముద్రతో సహా వింధ్యపర్వతం వద్దకు వెళ్ళి, "నాయనా, నేను పనిమీద దక్షిణానికి వెళుతున్నాను. దారి ఇయ్యి," అన్నాడు. వింధ్యుడు అగస్త్యుడికి సాష్టాంగపడి దారి ఇచ్చాడు. "నేను తిరిగి వచ్చేదాకా ఇలాగే ఉండు!" అన్నాడు అగస్త్యుడు. ఆ మహాముని దక్షిణం నుంచి తిరిగి రాలేదు, వింధ్యుడు తిరిగి తల ఎత్తనూ లేదు!

కాలకేయులనే రాక్షసులు సముద్రంలో నివసిస్తూ, రాత్రిపూట భూమి మీదికి వచ్చి బ్రాహ్మణులను క్షోభపెట్టసాగారు. సముద్రం ప్రవేశించి కాలకేయులను చంపటం దేవతలకు సాధ్యంకాక, వాళ్ళు అగస్త్యుడి శరణు జొచ్చారు. అప్పుడా ముని సముద్రజలమంతా ఒక్కగుక్కలో తాగేశాడు. కాలకేయులు బయట పడ్డారు. దేవతలు వారితో యుద్ధం చేసి అనేక మందిని చంపారు. చావగా మిగిలిన కాలకేయులు పాతాళంలోకి పారిపోయారు. అప్పుడు వట్టిపోయిన సముద్రం, భగీరథుడు గంగను భూమికి తెచ్చినప్పుడు తిరిగి జలమయమయింది.

అగస్త్యుడి ఆశ్రమం నుంచి బయలుదేరి పాండవులు అనేక తీర్థాలు సేవించుతూ కౌశికీనదీతీరాన్ని చేరి, అక్కడ ఉన్న విశ్వామిత్రుడి ఆశ్రమమూ, దాని అవతల ఉన్న విభాండకుడి ఆశ్రమమూ చూసి,



విభాండకుడి కొడుకైన ఋశ్యశృంగుడి కథ విన్నారు.

అంగదేశాన్ని పాలించే రోమపాదుడు దశరథుడి స్నేహితుడు. ఆయన బ్రాహ్మణులకు ద్రోహం చెయ్యగా బ్రాహ్మణులందరూ ఆ రాజ్యాన్ని వదిలిపోయారు. తరవాత అక్కడ వానలు కురవక క్షామం ఏర్పడింది. అప్పుడు రోమపాదుడు తన మంత్రుల సలహాపై వేశ్యలను పంపి, ఋశ్యశృంగుణ్ణి ఆకర్షించి తన దేశానికి తెచ్చుకుని తన కుమార్తె అయిన శాంతను అతనికిచ్చి పెళ్ళి చేశాడు. ఋశ్యశృంగుడు అడుగు పెట్టగానే అంగదేశంలో ఎప్పటిలాగా వానలు కురిశాయి.

పాండవులు ఇలా అనేక తీర్థాలు సేవిస్తూ మహేంద్రపర్వతం వద్దకు వెళ్ళారు. అక్కడ అకృతవర్ణుడనే వాడు ధర్మరాజుకు పరశురాముడి కథ చెప్పాడు. హైహయ వంశాన పుట్టిన కార్తవీర్యుడు దత్తాత్రేయుడి వరం చేత వెయ్యి చేతులు సంపాదించి, బలమదాంధుడై అనేక ఉపద్రవాలు చేశాడు. ఒకనాడు ఆ కార్తవీర్యుడు పరశురాముడి తండ్రి అయిన జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, ఆశ్రమాన్ని ధ్వంసం చేసి, హోమధేనువును పట్టుకుపోయాడు. పరశురాముడు ఆశ్రమానికి తిరిగి వస్తూనే ఈ సంగతి విని, కార్తవీర్యుడితో యుద్ధం చేసి చంపేశాడు. తరవాత కార్తవీర్యుడి కొడుకులు వచ్చి, ఒంటరిగా ఆశ్రమంలో ఉన్న జమదగ్ని గొంతుకోసి వెళ్ళిపోయారు. అప్పుడు పరశురాముడు పగబట్టి ఇరవై ఒక్కమారు ప్రపంచమంతా తిరిగి, కనిపించిన ప్రతి క్షత్రియుణ్ణీ చంపాడు.

పాండవులు ప్రభాసతీర్థాన్ని చేరుకున్నప్పుడు, ఆ వార్త తెలిసి బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాత్యకీ, అనిరుద్ధుడూ మొదలైన యాదవులు వారిని చూడవచ్చారు. ధర్మరాజు యుద్ధంలో కౌరవులనందరినీ చంపి రాజ్యం పొందుతాడని యాదవులు పాండవులకు ధైర్యం చెప్పారు.



యాదవులు ద్వారకకు తిరిగి వెళ్ళినాక పాండవులు తీర్థయాత్రలు కొనసాగించారు. వారు చివరకు గంధమాదనపర్వతం చేరి, అక్కడ అర్జునుడి రాకకోసం ఎదురు చూడ నిర్ణయించుకున్నారు. అది మహాపవిత్రమైన ప్రదేశం, అన్ని పుణ్యస్థలలాలోకీ గొప్పది. అక్కడ పాండవులు నరకాసురుడి అస్థికల గుట్టచూశారు.

వాళ్ళు గంధమాదన పర్వతాన్ని చేరబోతూ ఉండగా భయంకరమైన గాలి బయలు దేరింది. దానితో దుమ్ము లేచి అంతటా అంధకారమయి పోయింది. తరవాత ఆర్భాటంగా మెరుపులతో, ఉరుములతో కుంభపోతగా వర్షంకురిసింది. తమ్ము తాము రక్షించుకోవటానికి తలా ఒకదారీ అయిపోయారు. తిరిగి తెల్లవారే సరికి తెరిపి ఇచ్చింది. కాని ద్రౌపది నడకప్రయాస వల్లా, వానదెబ్బకూ, చలికీ గడగడవణుకుతూ మూర్ఛపోయింది. ఆమె రాళ్ళమీద పడిపోకుండా నకులుడు పట్టుకుని, ధర్మరాజును కేకపెట్టాడు. ధర్మరాజూ, భీముడూ, సహదేవుడూ ద్రౌపదిని ఆ స్థితిలో చూసి కొంతసేపు దిగ్భ్రమచెందారు.

ధర్మరాజు ద్రౌపది తలను తన తొడమీద పెట్టుకుని చాలా సేపు దుఃఖించాడు. మిగిలినవాళ్ళు ఆమెకు ఉపచారాలు చేశారు. దారి చాలా కంటకంగా ఉన్నది. ముందుకు సాగేమార్గం కనిపించ లేదు. అప్పుడు భీముడు తలచుకునే సరికి, ఘటోత్కచుడు తన రాక్షసబలగంతో వచ్చాడు. ఘటోత్కచుడు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తుకున్నాడు. మిగిలిన వాళ్ళను రాక్షసులు ఎత్తుకున్నారు. ప్రయాణం అతివేగంగా సాగింది. వాళ్ళు కాలక్రమాన కైలాసం సమీపంలో ఉన్న బదరికాశ్రమం దగ్గర గంగాప్రవాహం ఉన్నచోట రాక్షసుల భుజాలమీద నుంచి దిగి, గంగలో స్నానాలు చేశారు. అక్కడే వారు నివాసాలు ఏర్పరచుకున్నారు. అక్కడ ఉండే మునులు పాండవులకు కందమూలాలతో అతిథిసత్కారం చేశారు.

వాళ్ళు అక్కడ ఆరురోజులున్న తరవాత వారికి గాలి వెంట ఒక దివ్యమైన సువాసన తెలియ వచ్చింది. అంతలోనే పాండవుల మధ్య ఒక అపూర్వమైన పుష్పం పడింది. అది వెయ్యి రేకులుగల ఎర్రకలవపువ్వు. చూడటానికి ఎంతో అందంగా ఉండి, అద్భుతమైన సువాసనలు వెదజల్లుతున్నది.

ద్రౌపది ఆ పుష్పాన్ని తీసుకొని భీముడితో, "దీన్ని ధర్మరాజుకు ఇస్తాను. ఇలాటి పుష్పాలను మనం తీసుకుపోయి కామ్యకవనంలో ఉంచుకుందాం. నా కోసం ఈ పూలను వెతికి తీసుకురాగలవా?" అన్నది.

భీముడు ఆమె కోరిక తీర్చే ఉద్దేశంతో విల్లూ, అంబులపొదీ తీసుకుని, ఏ గాలికి సౌగంధికపుష్పం వచ్చిపడిందో ఆ గాలి వచ్చిన దిక్కుగా బయలుదేరాడు. కోకిలల పాటలూ, తుమ్మెదల ఝుంకారాలూ, సెలయేళ్ళగలగలలూ వింటూ ద్రౌపదిని తలుచుకుంటూ, దారికి అడ్డం వచ్చిన చెట్లను విరుస్తూ, లతలను తెంపేస్తూ, మధ్యమధ్య అరణ్యం దద్దరిల్లేటట్టు సింహనాదాలు చేస్తూ, చాలా దూరం వెళ్ళాడు. ఒకచోట అంతులేని అరటితోట వచ్చింది. ఆ అరటి చెట్లను తోసుకుని పోతూ భీముడు మళ్ళీ సింహనాదం చేశాడు. దానికి భయపడి నీటి పక్షుల గుంపు ఆకాశంలోకి ఎగిరింది. ఆ పక్షులను చూసి, అటుగా నీరున్నదని గ్రహించి భీముడు ఆ దిక్కుగా వెళ్ళి ఒక సరస్సును చేరుకున్నాడు.

భీముడు ఆ సరస్సులో చల్లగా స్నానం చేసి, మళ్ళీ అరటితోట వెంబడి బయలుదేరి, కొంతదూరం వెళ్ళి, భుజాలుచరచుకుని, మరొకసారి సింహనాదం చేశాడు. ఆ అరటితోటలోనే ఉన్న హనుమంతుడు, ఆ సింహనాదం చేసినది భీముడని గ్రహించి, భీముణ్ణి చూడబోతున్నందుకు సంతోషించి, భీముడు వచ్చేదారికి అడ్డంగా పడుకుని, తన తోకను టెక్కెంలాగా పైకి ఎత్తి, దిక్కులు అదిరేలాగా ఒక్క చరుపు చరిచాడు.

ఆ చప్పుడు విని భీముడు హనుమంతుడు ఉన్న చోటికి వచ్చాడు.





# శివపురాణం

## 7

శివపార్వతులకు పుట్టబోయే కొడుకు తారకుణ్ణి చంపుతాడని బ్రహ్మ చెప్పినందుకు సంతోషించి, దేవతలు స్వర్గానికి తిరిగి వచ్చి మన్మధుడికి కబురు పంపారు. మన్మధుడు వచ్చాడు. ఇంద్రుడు అతన్ని సింహాసనం మీద కూర్చోబెట్టి, "మన్మథా, తారకుడు బ్రహ్మ వల్ల వరాలు పొంది, మూడు లోకాలూ జయించి, దేవతలనూ, ఋషులనూ బాధించుతూ, తపస్సులూ, యాగాలూ జరగనివ్వకుండా ఉన్నాడు. నేను మూడులోకాలూ ఏలుతూంటే, తారకుడు నన్ను ఏలుతున్నాడు. ఈశ్వరుడి వీర్యాన పుట్టినవాడి వల్ల తప్ప అతనికి మరణం లేదు. ఈశ్వరుడేమో కైలాసంలో తపస్సు చేసుకుంటున్నాడు. పార్వతి అతనికి సపర్యలు చేస్తున్నది. పార్వతి శివుడి సమీపంలో ఉండగా నువు ఎలాగైనా సరే శివుడికి మోహం కలిగే లాగు చెయ్యాలి," అన్నాడు.

ఇంద్రుడి కోరిక విని మన్మధుడు భయపడి, "శివుడికి పార్వతి యందు మోహం కలిగేటట్టు చెయ్యటం నా తరమా? శివుడు గొప్ప తపశ్శాలి. కోపిష్టివాడు. మూడోకన్ను తెరిచాడంటే మూడులోకాలూ భస్మమవుతాయి," అన్నాడు.

మన్మధుడిలా అనేసరికి ఇంద్రుడు మొదలైనవాళ్ళు అతనికి ధైర్యం చెబుతూ, "అదేం మాట? మూడు లోకాలలోనూ నీకు లొంగని వారెవరున్నారు? నీ మూలాన స్త్రీ పురుషులు మోహాంధులు కావటం వల్లనే గదా సృష్టి కొనసాగుతున్నది? నీ పుష్పబాణాల తాకిడికి ఎలాటి తపస్సూ నిలవదు. పైగా ఇది దేవకార్యం. లోకరక్షణ నీ ద్వారా జరగవలసి ఉన్నది. నీకు సహా



యంగా మలయమారుతాన్నీ, వసంతుణ్ణీ, శుక, పికాలనూ తీసుకుపో. మేము కూడా వచ్చి నీకు సహాయం చేస్తాం. శివుణ్ణి నీ బాణాలతో కొట్టి వశపరుచుకో," అన్నారు.

మన్మథుడు ఈ మాటలతో పొంగిపోయి, శివుణ్ణి జయించి, ఆయనకు పార్వతి పైన మోహం కలిగేటట్టు చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు. అతను తన ఐదు పుష్ప బాణాలను తీసుకుని, వసంతుణ్ణి వెంట బెట్టుకుని, చిలుక వాహనం మీద శివుడు తపస్సు చేసుకుంటున్న మారేడువనానికి వెళ్ళి, ఒక రహస్య ప్రదేశంలో దాగి, పార్వతి రాకకోసం ఎదురు చూడసాగాడు.

మన్మథుడు ప్రవేశించగానే మారేడువనం వసంత శోభతో నిండిపోయింది. చెట్లు చిగిర్చి, పూత పూశాయి. చిలుకలూ, గోరువంకలూ, కోకిలలూ పాడాయి. కొద్ది సేపట్లో పార్వతి తన చెలికత్తెలతో సహా మారేడు వనం ప్రవేశించింది. వాళ్ళు తమ వెంట పుష్పాలూ, ఫలాలూ, సుగంధ ద్రవ్యాలూ తెచ్చారు. వనం పూర్తిగా మారి ఉండటం చూసి ఆశ్చర్యపడుతూ పార్వతి శివు డున్న చోటికి వెళ్ళింది.

పార్వతిని శివుడు కన్నెత్తి చూశాడు. పార్వతి కొత్తగా కనబడింది. వన మంతా వింతగా కనబడింది. కాని శివుడు ఈ మార్పుకు కారణ మేమిటని ఆలోచించక, మళ్ళీ కళ్ళు మూసుకుని తపస్సులో మునిగిపోయాడు.

పార్వతి రోజులాగే శివుడికి షోడశోప చారాలూ చేసి, వందనం చేసి, ధ్యానిస్తూ శివుడి ఎదట నిలబడింది. అప్పుడు శివుడు ఆమెను మళ్ళీ చూసి, ఎన్నడూలేని మోహా వేశం చెంది, అలాగే ఆమె కేసి చూస్తూ ఉండిపోయాడు.

పార్వతి శివుడి వద్ద శలవు పుచ్చుకుని వెనక్కు తిరిగి వెళ్ళి పోసాగింది. శివుడు మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఆ సమయంలో మన్మథుడు తన పుష్పబాణాలను ఒకటొకటిగా శివుడి హృదయానికి గురి

చూసి కొట్టాడు. అరవిందమూ, అశోకమూ, చూతమూ, నవమల్లికా శివుణ్ణి కదిలించలేక పోయాయి. కాని మన్మథుడి అయిదో బాణమైన నీలోత్పలం శివుడి హృదయాన్ని గాయ పరిచింది. దాని దెబ్బకు తాళలేక శివుడు ఆగ్రహావేశంతో, "ఎవడురా, నన్ను పుష్ప బాణాలతో కొట్టినవాడు?" అంటూ లేచి నిలబడి, మూడో కన్ను తెరిచాడు.

శివుడు మూడో కన్ను తెరవగానే అందులో నుంచి అగ్నిజ్వాలలు బయలుదేరి వనమంతా ఒక్క క్షణంలో బూడిద అయిపోయింది. దానితోబాటే మన్మథుడు కూడా బూడిద అయిపోయాడు.

దేవేంద్రుడు మొదలైన దేవతలు శివుడి ఎదటికి వచ్చి స్తోత్రపాఠాలు చదివి ప్రసన్నుణ్ణి చేసుకున్నారు. ఆయన తన మూడో కన్ను మూసి, అగ్నిజ్వాలలను ఉపసంహరించాడు. అప్పుడు, మన్మథుడి భార్య అయిన రతీదేవి శివుడి ఎదటికి వచ్చి, "సదాశివా, నా భర్త వల్ల ఏ తప్పూ లేదు. నీ వల్ల పార్వతికి కుమారుడు కలిగితే అతను తారకుణ్ణి చంపగలడన్న ఆశతో ఈ దేవేంద్రుడు మొదలైనవాళ్ళు, నీకు పార్వతి మీద మోహం కలిగించమని నా భర్తను ప్రేరేపించారు. మా తప్పులు మన్నించి, నాకు పతిభిక్ష పెట్టు. పార్వతిని వివాహమాడి, లోకాలను కాపాడు," అన్నది.

శివుడు రతీదేవితో, "మన్మథుడు బ్రహ్మ శాపం కారణంగా భస్మమయాడు. అతను బ్రహ్మను కూడా ఇలాగే పూలబాణాలతో కొట్టి



ఆయనకు కుమార్తెపై మోహం రేకెత్తించి, శాపం పొందాడు. కాని నీ పాతివ్రత్యానికి భంగం రానివ్వను. అతను లోకానికి శరీరం లేనివాడైనప్పటికీ, నీకు మటుకు శరీరంతోనే కనిపిస్తాడు. అతనికి యిప్పుడే ప్రాణం ఇస్తాను," అన్నాడు.

తరవాత శివుడు తపస్సు మాని కైలాసంలో తన రుద్రగణాలతో కొలువు తీరి, అగ్నిని పిలిచి, "అగ్నీ, ఇకముందు నువు వృక్షాలలోనూ, పర్వతాలలోనూ, సముద్రం లోనూ కనబడకుండా దాగి ఉండు," అని ఆదేశించాడు.

దేవేంద్రుడూ, దేవతలూ శివుడి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు. శివుడి మనస్సు పార్వతిపై లగ్నమయింది. ఆయన పార్వతిని వివాహమాడ నిశ్చయించుకున్నాడు.

శివుడు వనాన్నీ, మన్మధుణ్ణీ భస్మం చేయటం కళ్ళారా చూసిన పార్వతి భయపడి తన చెలికత్తెలతో సహా పరిగెత్తుకుంటూ ఇంటికి తిరిగి వచ్చింది. జరిగినదంతా విని మేనకా హిమవంతులు తమ కుమార్తె పునర్జన్మ ఎత్తినట్టే భావించుకున్నారు. వాళ్ళు పార్వతిని ఊరడించి, ఆమె భయం పోగొట్టారు.

పార్వతి మటుకు శివుడి కోసం విరహం చెంది బాధపడసాగింది. ఆమెకు శివుడి ధ్యాస తప్ప మరొకటి లేదు. శివుడి కోసం నిద్రాహారాలు మాని తపించే తమ కూతురితో మేనకా హిమవంతులు, "నీకూ, శివుడికీ త్వరలోనే పెళ్ళి చేస్తాం, విచారించకు," అని చెప్పారు.

ఒకనాడు నారదుడు వచ్చి పార్వతితో, ఆమెను శివుడు పెళ్ళాడతాడని ధైర్యం చెబుతూ, శివపంచాక్షరీ మంత్రం ఉపదేశించి, దాన్ని జపించినట్టయితే ఎలాటి కోరికలైనా తీరుతాయనీ, సమస్త సుఖాలూ కలుగుతాయనీ చెప్పి, మేనకా హిమవంతుల వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

తరవాత పార్వతి శివపంచాక్షరీ మహా మంత్రాన్ని జపించుతూ, శివధ్యానంలో నిమగ్నురాలయింది.



# 117. "బియర్డ్‌మోర్" హిమానీ నది

ప్రపంచంలో గల రెండు, మూడు పెద్ద హిమానీనదులలో ఒకటి "బియర్డ్‌మోర్" హిమానీనది. ఇది దక్షిణధృవ ఖండంలో ఉన్నది. దక్షిణ ధృవాన్ని చేరుకోవటానికి వెళ్ళిన షాకిల్టన్, స్కాట్ అనే వారిద్దరూ ఈ హిమానీనది మీదుగానే వెళ్ళారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆశయమాలలు అల్లుకో

పంపినవారు:
కమలాదేవి,

Photo by A. V. Rangaiah



పినిశెట్టివారి వీధి,
పాలకొల్లు

ఆనందహాసాలు చల్లుకో

బహుమతి
పొందిన వ్యాఖ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఆగస్టు నెల 10 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

రెండవ అట్ట:
గాంధీమండపం, కన్యాకుమారి

మూడవ అట్ట:
హిపోపోటమస్ (నీటిగుర్రం)

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

గంగాధర్

శ్రీకృష్ణా ఫిలింస్ సమర్పించు

# నమ్మకద్రోహులు




విజయా పిక్చర్స్

NCM-23 TEL

పాలూ, తేనె
కమ్మని మాల్టు
కలిపి చేసితిని
న్యూట్రిన్ స్వీటు




# న్యూట్రీన్ లాక్టో నావెల్టీస్

పిల్లల ఓటు!




నల్లని మెరిసే కాగితమ్ములో పిల్లలకోసం దాగి వున్నది
న్యూట్రిన్ నావెల్టీ తీపి మిఠాయి!

ఒక్కొక్క మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)

# మీ బాలుడు బలహీనంగా ఉన్నాడా?
# అతని ఆహారంలో పోషక శక్తి సరిగా లేదా?
# అతనికి సరిగా ఆకలి వేయడా?
# అయితే అతనికి ఫెరడాల్ ఇవ్వండి...

అతను ఎంత బలంగా, దిట్టంగా ఎదుగుతాడో పరిశీలించండి. పాలు, ఆహారధాన్యాలు, కూరగాయలు, పళ్లు మరియు గ్రుడ్లు వంటి స్వాభావిక ఆహారాలవల్ల లభించే మేలును, పోషణను మీ బిడ్డకు ఒక ఫెరడాల్ మాత్రమే సమకూర్చగలదు. ఎందువల్లనంటే, ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు ఫెరడాల్‌లో ఖచ్చితంగా సరియైన పాళ్లలో ఉన్నాయి. ఎముకలు దంతాలు దృఢంగా తయారవాలన్నా, కండరాలు బలంగా పెరగాలన్నా, పుష్టిగల రక్తం పట్టాలన్నా, శరీరంలో రోగనిరోధక శక్తి వృద్ధి పొందాలన్నా, కంటి చూపు కలకాలం బాగా ఉండాలన్నా, మీ బిడ్డ చురుకుగా ఆరోగ్యంగా ఎదగాలన్నా, ఫెరడాల్‌లో ఉన్న ఈ ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు మిక్కిలి అవసరం. ప్రతిరోజు, ప్రొద్దున పూట రాత్రి పూట మీ బాలునికి ఫెరడాల్ ఇవ్వండి. పాలతో కలిపి అయినా సరే, దేనితోను కలపకుండా యథాతథంగా నైనా సరే తీసుకోవచ్చును. కుటుంబంలో అందరికీ ఫెరడాల్ మంచిదని గుర్తుంచుకోండి.






## ఫెరడాల్®

కమ్మని రుచి కలది
కుటుంబమంతకూ మంచిది

**పార్క్-డేవిస్** ఉత్పత్తి

● రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్. రిజిస్టర్డ్ యూజర్లు—పార్క్-డేవిస్ (ఇండియా) లి., బొంబాయి-72 ఎస్.

JAISONS 6






# నియమానుసారం ఫోర్‌హేన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్నీ అరికట్టుతుంది.




ఫోర్‌హేన్స్
దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్‌పేస్టు

ఫోర్‌హేన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా రక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టింపబడింది. ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన పదార్థాలు దీనిలో ఉన్నాయి. నియమానుసారం, రాత్రి, ప్రొద్దుట, ఫోర్‌హేన్స్‌తో పళ్ల తోముకుంటే, ఇగుళ్ల బాధలు, దంతక్షయము మీ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం నేర్పటానికి ఇదే మంచి తరుణం. క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పటం ఉత్తమం. కావున, నేడే ప్రారంభించండి.

ఫోర్‌హేన్స్ దంతసంరక్షణ ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.

---

**ఉచితము** "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పది భాషలలో*, మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ 10031, బొంబాయి-1 బిఆర్, వద్ద దొరకును.

పేరు ______________ వయస్సు ______________

చిరునామా ______________



* పోస్టు ఖర్చులకై, 20 పైసల తపాలా బిళ్లలు పంపండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉరుదు, బెంగాలీ, తమిళం, తెలుగు, మలయాళం, కన్నడ భాషలలో ఏదో కావాలో సూచిస్తూ, దాని క్రింద గీతగీయండి.

92F-183D TEL




నమలండి

# చిక్లెట్స్ చూయింగ్ గమ్,

## తెలుసుకోండి వాటి మజా

ఊరూర తిరుగుతూ తెచ్చాడు చిక్లెట్స్ బఫూన్
మీ లాంటి పిల్లలకు చిక్లెట్స్ చూయింగ్ గమ్
మీరు ఎరుగని నాల్గు క్రొత్త చూయింగ్ గమ్ రుచులతో
ఆరంజ్, లెమన్, పెప్పర్‌మింట్, టూటి-ఫ్రూటి.

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి



వివా త్రాగండి—వేడిగా లేక చల్లగా, నీళ్లలో లేక పాలలో. మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో పుష్టివంతముగా చేయబడినదే వివా. అది స్నాయువులను బలపరుస్తుంది, నరములకు ఉపశమనమును కలిగిస్తుంది, కండరములకు సేదదేరుస్తుంది.

ప్రొద్దున్న వివా త్రాగుతే రోజంతా ఉత్సాహముగా ఉంటారు!
రాత్రి వివా త్రాగుతే గాఢముగా నిద్రపడుతుంది!
వివా సులభముగా జీర్ణమవుతుంది. అది రోగులకు, రోగము నుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సు చేయబడినది.

***రుచిగా ఉంటుంది కమ్మగా***
***జీర్ణమవుతుంది త్వరగా!***








Shilpi-JI-C2-71 TEL.



# అధిక పుష్టినిచ్చే బ్రిటా బిస్కట్లు తక్కువ ధరకు ఎక్కువ బిస్కట్లు

బ్రిటానియా బ్రిటా బిస్కట్ల నిండుగా పిల్లలకు పుష్టినిచ్చే పదార్థాలున్నాయి. అవి ఎంతో పసందుగా కూడా వుంటాయి. ఈ చిన్న చిన్న బిస్కట్లను మీరెంతో ప్రీతితో తినగలరు. పైగా తక్కువ ధరకే ఎక్కువ బిస్కట్లు లభిస్తాయి.

## బ్రిటానియా బ్రిటా బిస్కట్లు

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు బ్రిటానియా

BBC-2768

